॥ శ్రీహరిః ॥

682

# భక్తపంచరత్నాలు

भक्त-पंचरत्न ( तेलुगु )



గీతాప్రెస్, గోరఖ్‌పూర్

!!శ్రీహరిః!!

682

# భక్త పంచరత్నాలు

भक्त-पञ्चरत्न ( तेलुगु )



హిందీ మూలము

శ్రీ హనుమాన్ ప్రసాద్ పోద్దార్

ఆంధ్రానువాదము

పండిత శ్రీ జయన్తి సుబ్రహ్మణ్య శాస్త్రి ఎమ్.ఎ.,

పరిష్కర్త - సంపాదకుడు

శ్రీ సందెపూడి రామచంద్రరావు. ఎమ్.ఎ.,

ప్రచురణ

గీతా ప్రెస్ - గోరఖ్ పూర్

॥ శ్రీహరిః ॥

# భక్తపంచరత్నాలు

## 1. భక్త రఘునాథుడు

కృష్ణచంద్ర మహాపాత్రుడు జమిందారు. అతిథి అభ్యాగతులతో అతని భవనం ఎల్లవేళలా సందడిగా ఉంటుంది. అతని భార్యమహా పతివ్రత. ఉదారస్వభావం కలది, ఆదర్శవతి. పేరుకు తగినట్లుగా ఆమె నిజంగా కమలే.

ఈశ్వరానుగ్రహం వలన కృష్ణచంద్రమహాపాత్రునికొక కుమారుడు కలిగాడు. అతని పేరు రఘునాధుడు. అందగాడేకాక మంచి గుణాలుకూడా కలవాడు. రఘునాధుడు చిన్నతనంనుండి అణకువతో కూడిన స్వభావం కలవాడు. మంచి నడవడికతో అందరినీ ఆనందపరిచేవాడు. రఘునాధుడు ప్రతిరోజూ దేవాలయానికి వెళ్ళి, దేవునికి నమస్కరిస్తు, కీర్తనలు పాడుతూ, స్తుతించుచూ ప్రదక్షిణలు చేస్తుండేవాడు. పదిహేడు సంవత్సరాల వయస్సు వచ్చిన పిమ్మట కలావతీపురానికి సంబంధించిన గంగాధరుని కుమార్తె అన్నపూర్ణతో రఘునాధుని వివాహం తల్లిదండ్రులు జరిపించారు. ఏడుగురు అన్నలకు ఏకైక సోదరి అన్నపూర్ణ. ఒక్కతే ఆడపిల్ల కావడంవలన ఆమెను అందరూ ఎంతో గారాబంగా చూసేవారు. అందుచేత ఆమె వివాహం చాలా ఘనంగా జరిపారు. మంచి లక్షణాలుగల అన్నపూర్ణ రాకతో కమల ఇల్లు ఆనందంతో కళకళలాడింది. కాని, విధివ్రాతను తప్పించటం ఎవరితరం? కొన్ని సంవత్సరాలకు కరువు సంభవించింది. కృష్ణచంద్రుడు భూమిపన్ను వసూలు చేయడం మానేశాడు. అతను చాలా దయాస్వభావం కలవాడగుటచేత తనకున్న ధనాన్నంతా పేదరైతులకోసం ఖర్చుచేశాడు. ఇల్లంతా ఖాలీఅయింది. పేరు ప్రతిష్ఠలకోసం ఖర్చుచేయడం మొదలుపెడితే పేదరికం సంభవించినా తక్కువఖర్చులు చేయడానికి సంశయంకలుగుతుంది. కృష్ణచంద్రునికి రాబడితక్కువైంది. ఖర్చులు ఎక్కువైపోయాయి. జమిందారీ అంతా అప్పులపాలయిపోయింది.

మానసికాందోళనలు పెరిగిపోయిన కొద్దీ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది. ఆయన మంచంపట్టాడు. మరణమాసన్నమైనది. అటువంటి సమయంలో రఘునాధుని దగ్గరగా పిలిచి, తన శిరస్సునతని ఒడిలో ఉంచి ఒణుకుతున్న కంఠంతో ఇలా చెప్పడం మొదలెట్టాడు, "నాయనా! నేను వెళ్ళిపోతున్నాను. నామాట ఒకటి విను. ఎప్పుడూ ఎవరికీ బాకీలు ఎగగొట్టడానికి ప్రయత్నించకు. మనకు అప్పులు చాలా ఉన్నమాట నిజమే. అవి అన్నీ తీర్చడానికే ప్రయత్నించు. భగవంతుడు నీకు అన్ని విధాలుగా సహాయపడతాడు" ఈ మాటలు కుమారునికి చెప్పి కృష్ణచంద్రుడు శాశ్వతంగా కన్నుమూశాడు. భర్తతోపాటు అతని ప్రాణసమానురాలైన కమల కూడా సహగమనం చేసింది. రఘునాధుని తలమీద మోయలేని భారంపడింది.

అన్నపూర్ణ పెద్దింటిఅమ్మాయి కావడంవల్ల ఆమె పుట్టింటిలోనే ఉంటుండేది. వారివద్ద ధనంచాలా ఉంది. అయినా వాళ్ళు చాలా కక్కుర్తి మనుష్యులు. రఘునాధుడి అవస్థను వారంతావిన్నారు. కాని వారేమీ సహాయం చేయలేదు. పట్టించుకోనూ లేదు. డబ్బు బాగా సంపాయించారే కాని దాని సద్వినియోగం వారికి తెలియదు. రఘునాధుడు అసాధారణమైన వ్యక్తిత్వం కలవాడు. అతనికి గొప్పవారితో పరిచయం ఉంది. కాని వారి పలుకుబడి రఘునాధుడు ఉపయోగించుకోలేదు. వారిముందు గంగాధర కరణం సూర్యునిముందు మిణుగురు పురుగులాంటివాడు. రఘునాధుడు ఆర్థికసహాయం కోరడానికి అత్తవారింటికి వెళ్ళలేదు. తనకున్న ఆస్తినంతనూ అమ్మేసి అప్పులు తీర్చేశాడు. అత్తవారి ద్వారా వరకట్నంగా లభించిన ధనాన్ని దైవసేవకే వినియోగించి చిరిగిపోయిన బొంత, కౌపీనం తీసుకొని ఇల్లువదిలి వెళ్ళిపోయాడు.

నాచు బురదలతో కూడిన పద్మం వికసించి సుందరంగానే ఉంటుంది. చిరిగిపోయిన మలిన వస్త్రాలతో ఉన్నప్పటికి రఘునాధుని ముఖం ఎంతో శోభతో అలరారుతోంది. అతని భక్తి మేలుజాతిపుష్పంలా సుగంధాన్ని వెదజల్లుతోంది. ఆ సుగంధం సమస్త ప్రపంచాన్ని గుబాళింపచేస్తోంది. రఘునాధుడి జీవితం దేదీప్యమానంగా భక్తితో



వెలిగిపోతోంది.

రఘునాధుడు గ్రామగ్రామానికి వెళ్ళి ముష్టెత్తుకుంటూ జీవితాన్ని వెళ్ళబుచ్చుతున్నాడు. ఒకనాటి రాత్రి ఓ చెట్టు కిందపడుకొని ఇలా ఆలోచించసాగాడు. "ప్రతి గ్రామంలో రోజూ ఇలా ముష్టి అడుక్కుంటూ తిరిగినందువల్ల ఏంలాభం? పశువులా ఆహారం నిద్రాపొందితే చాలా? ఏదైనా ఓ పుణ్యక్షేత్రానికి వెళ్ళి ఎక్కడో ఓ చోట కూర్చొని భగవన్నామస్మరణ చేస్తూ జీవనం గడిపితే నయం".

ఇలా ఆలోచించి రఘునాధుడు గొప్పశ్రద్ధాభక్తులతో 'పూరీ' వెళ్ళాడు. అక్కడ దైవదర్శనం చేసుకున్నతర్వాత చేతులుజోడించి భగవంతునితో ఇలా మొరపెట్టుకోసాగాడు.

"నా తల్లిదండ్రులిరువురూ చనిపోయారు. నేను అనాధుణ్ణి అయిపోయాను. ఇప్పుడు నేను రక్షణలేనివాడనయ్యాను. నీ చరణాలను ఆశ్రయించాను. కాని, నా ఇష్టంతో ఏముంది? అంతా నీ ఇష్టమే, నీ ఇష్టమే నా ఇష్టం. ఇప్పుడు నీ ఇచ్ఛ ఎలా ఉంటే అలాచెయ్యి. ఒక విషయం జ్ఞాపకం ఉంచుకో. ఏమంటే- రఘునాధుడీనాడు నీ సేవకుడు" అన్నాడు.

భగవంతుడు తన అభయముద్రచూపుతూ అతనితో ఇలా అన్నాడు. "నీకేంభయం లేదు, నువ్వు ఇక్కడ మహాప్రసాదాన్ని భుజిస్తూ, సంతోషంతో తత్త్వవిచారణ సాగించు. రఘునాధా నన్ను నువ్వు సేవకునిగా చేసుకున్నావు" అని పలికిన భగవంతుని ఆజ్ఞను శిరసావహించి అక్కడే ఉంటూ ఏది ఎప్పుడు ఎక్కడ దొరికితే దాన్ని స్వీకరిస్తూ భగవంతుని ముఖకమలాన్ని చూస్తుండటం ఇదే రఘునాధుని కర్తవ్యం. అప్పటినుండి రఘునాధుని మనసు ఎంతో ఆనందంతో నిండిపోయింది. పాతస్మృతులన్నీ అతని మనస్సునుండి తొలగిపోయాయి. స్మృతులేకాదు భార్య అన్నపూర్ణకూడా అతని స్మృతిపథం నుండి, మనః ఫలకంనుండి చెరిగిపోయింది.

ఈ వార్తలు కొద్దిరోజుల్లోనే రఘునాధుడి అత్తారింటికి చేరాయి. అతడు దరిద్రుడై ముష్టిఅడుక్కుంటున్నాడంటే గౌరవానికి భంగం వాటిల్లుతుంది. అందుకని గంగాధరుడీ విషయాన్ని తన కుమారులముందు పెట్టాడు. వాళ్ళు అన్నపూర్ణకి మరల వివాహం చేయాలని తలపెట్టారు. అన్నపూర్ణ అన్నలు వరునికోసం వెదకసాగారు. చివరికి ఓ సంబంధం స్థిరపరిచారు. ఆ దేశపు మంత్రికుమారుడు బసుమహాపాత్రుడు. ఈ బసుమహాపాత్రుడు చాలా దుష్టుడు. వాడితోనే అన్నపూర్ణ వివాహం నిశ్చయింపబడినది.

మంత్రిపుత్రుడూ, గంగాధరుడు ఇరువురూ ధనవంతులే. ఈ ఇద్దరూ గొప్ప పలుకుబడి కలవారు. వారి ఈ అన్యాయాన్ని ఎదిరించడానికి ఎవరికీ శక్తిలేదు. వివాహపుముహూర్తం నిశ్చయించారు. అది ఫాల్గుణ శుక్లపంచమి. అన్నపూర్ణ అందరి మాటలువిన్నది. అన్నపూర్ణ వయసు పదిహేను సంవత్సరాలకంటే ఎక్కువే. ఆమె ఏమి తెలియని అమాయకురాలు కాదు. తల్లిదండ్రులు చేస్తున్న పనిని తెలుసుకున్న అన్నపూర్ణ మనసుచాలా వ్యాకులమైంది. అయితే దీన్నుండి తప్పించుకునే ఉపాయమేమిటి? ఆమె తన మనస్సులోని బాధనంతా భగవంతుడికి చెప్పుకోసాగింది.

"ఓ భగవంతుడా! నా భర్త జీవించి ఉండగా మరొకరితో నా వివాహమా? నా తనువు మనస్సులను ఆయన చరణాలకి అర్పించాను. ఈ శరీరంతో ఇతరుడి మొహం ఎలాచూడగలను! కష్టంలో ఉన్నగజేంద్రుని కాపాడినావు. ద్రౌపది మానసంరక్షణ చేశావు. నువ్వు అంతర్యామివి. నేను నీకు ఏంచెప్పుకోను? "ఓ పరమేశ్వరా! నేను పతివ్రతను. వ్యభిచారిణినికాను. నన్నీ కష్టసముద్రంనుండీ ఉద్ధరించు దేవా!".

అన్నపూర్ణ రాత్రింబగళ్ళు ఒంటరిగా కూర్చొని భగవంతుడితో మొరపెట్టుకుంటూ కన్నీరు కారుస్తోంది. ఆమె భోజనం చెయ్యదు. మంచినీళ్ళు తాగదు. నవ్వదు. మాట్లాడదు. అలంకరణలన్నీ విడిచిపెట్టేసింది. రాత్రంతా జాగారం చేస్తోంది. ఎవరితోనూ మాట్లాడదు. ఎవరినీ తన దగ్గరకు రానీయదు. ఇంట్లో పూర్వంనుండీ వున్న దాసి వుంది.



ఒకనాడాదాసీతో తన కష్టాన్ని గురించి చెప్పుకోసాగింది అన్నపూర్ణ.

"దాసీ! ఇక్కడనుండి ఎవరైనా పూరీ వెళ్ళేవారుంటే కనుక్కో. నా భర్తకు ఒక ఉత్తరం వ్రాసిస్తాను. నేనున్న ఈ విపత్కర పరిస్థితి వారికి తెలిస్తే, వారూరుకోరు. నన్నీ ఆపదనుండి రక్షిస్తారు" అంది.

అన్నపూర్ణ ఆశించిన విధంగానే పూరివెళ్ళి జగన్నాధస్వామిని దర్శించే వారిజాడ తెలిసింది దాసీకి. వెంటనే ఆ దాసి అన్నపూర్ణ దగ్గరకొచ్చి ఈ సమాచారం తెలిపింది. వెంటనే అన్నపూర్ణ తన భర్తకు ఈ విధంగా ఉత్తరం వ్రాసింది. "ప్రభూ! నా కష్టాన్ని వినండి రాబోయే ఫాల్గుణ శుక్ల పంచమి రోజున ఈ దేశపుమంత్రిగారి కుమారుడితో నా వివాహం నిశ్చయమైంది. పాదదాసి మీద మీకు ఏపాటి దయున్నా శీఘ్రంగా ఎంత మాత్రం ఆలస్యము చెయ్యకరండి. మీరావడం, రాకపోవడం మీ యిష్టంమీద ఆధారపడి ఉంది. నేను మాత్రం మీ రాకకు రోజులు లెక్కపెట్టు కుంటూంటాను. తొందరగా వచ్చి మీరాదుకోకపోతే నేను ఆత్మహత్య చేసుకుంటాను".

ఈ విధంగా వ్రాసిన ఉత్తరాన్ని దాసికిస్తు ఇలా చెప్పింది. "దాసీ! ఈ ఉత్తరాన్నిచ్చి నా పక్షాన చేతులు జోడించిచెప్పు. నా ప్రాణపతి పూరీలో ఉంటున్నారు. ముష్టిఅడుక్కుని తింటున్నారు. అక్కడ రఘునాధుడు అరక్షితుడుగా చెప్పుకుంటున్నారు. ఇంకా ఇలాచెప్పు. ఏమనంటే నా జీవనం మీదయమీద ఆధారపడి ఉంది. నీవు ఈ ఉత్తరాన్ని నా భర్తచేతుల్లో ఉంచినట్లయిన కోటిజన్మలవరకూ నీకు ఋణపడి ఉంటాను" అంది.

దాసి ఆ ఉత్తరాన్ని తీసుకెళ్ళి పూరీ వెళ్ళేవారికిచ్చింది. విషయాన్ని వారితో వివరంగా చెప్పింది. వారు కూడా అన్నపూర్ణ మీద పూర్తి సానుభూతిచూపుతూ, ఆ ఉత్తరాన్ని తీసుకొని, నిశ్చింతగా ఉండమని చెప్పి, వారు పూరీ వెళ్ళిపోయారు.

మాఘమాసాంతానికి వారు పూరీ చేరారు. చాలా రోజులవరకూ

రఘునాధుని జాడ వారికి తెలియలేదు. ఒకనాడు హఠాత్తుగా ఆలయసమీపంలో రఘునాధుని కలిశారువాళ్ళు. తాము తెచ్చిన ఉత్తరాన్ని ఆయనకిచ్చారు. ఉత్తరం చదువుతూంటె రఘునాధుని మనసు చాలా కలవరపడసాగింది. దీనిపై ఆలోచించసాగాడు. వివాహానికింకా పదిరోజుల వ్యవధిమాత్రమే ఉంది. పూరీ నుండి కళావతీపురం చేరడానికి నెలరోజులు పడుతుంది. ఈ లోపుగా వెళ్ళి ఆమెను రక్షించకపోతే ఆమె ఆత్మహత్య చేసుకుంటుంది. ఎలా అక్కడికి ఈ లోపుగా చేరటం? రఘునాధుడికేం చెయ్యాలో అర్థంకాలేదు. చిట్టచివరికి భగవంతుడిపై భారంవేస్తూ భగవంతుడుతప్ప ఈ విపత్తునుంచి కాపాడగల వారెవరున్నారు? అనుకొని దేవుడికి మొరపెట్టుకోసాగాడు.

"చక్రపాణీ! ఓయి భక్త కల్పద్రుమా! ఓ దయాసాగరా! ప్రతివ్రత మనసులోని బాధను తొలగించగలవాడా! నా భార్యయొక్క మనోబాధను తీర్చడానికి ఏమిటి ఉపాయం? ఓ సర్వాంతర్యామి! మీ వద్ద ఏ దాపరికం లేకుండా మొరపెట్టుకుంటున్నా, ఈ కఠినసమయంలో నువ్వుతప్ప రక్షించేవారెవరు? అంటూ ఈ విధంగా వ్యాకులంగా ఆర్తుడై రఘునాధుడు భగవంతుడి ఎదుట ఎన్నిమాటలు చెప్పాడో తెలియదు. రాత్రిచాలా గడిచింది. బాధపడుతున్న మనసుతో ఆ భగవంతుణ్ణి స్తుతిస్తూ ఆలయసింహద్వారం దగ్గర ఉన్న ఓ అరుగుమీద నిద్రపోయాడు రఘునాధుడు. తాను దుర్బలుణ్ణి అని ఎరిగి హృదయతః భగవంతుణ్ణి పిలిస్తే తక్షణమే ఆ పిలుపు భగవంతునికి వినబడుతుంది. జగన్నాధుడు తన భక్తుని బాధనుచూసి చాలా వ్యధితుడైనాడు. అలా నిద్రలోనే రఘునాధుడు భగవంతుని మాయవల్ల కళావతీపురంలోని గంగాధరునియొక్క గుమ్మంలో ఉన్నాడు".

ఈ విషయంలో ప్రజలనుకునేదేమంటే ఈ రోజుల్లో ఇదంతా కేవలం కల్పన అని. ఇటువంటి ఆశ్చర్యకరమైన సంఘటనలు ఎప్పుడూ జరిగేవికావు. అందుచేత ఇవన్నీ కట్టుకథలే అని అనుకునే వారే ఎక్కువ కాని భగవంతుని నిష్కల్మష హృదయంతో ప్రార్థిస్తే, కష్టాలలోని వారి ప్రార్థనలను తప్పక వింటాడు. ఎందుచేతనంటే భగవంతుడు ప్రకృతికి



అతీతమైనవాడు కనుక. నిరాకారమైన దైవం సాకారమవడమే అలౌకికమవుతుంది. ఈ విషయాన్ని భగవంతుడే స్వయంగా చెప్పాడు.

జన్మ కర్మ చమే దివ్యమ్ అని ఎవరైతే భగవంతునియొక్క నిజమైన భక్తుడో అటువంటివాడు భగవంతుని శక్తినిపొంది అలౌకిక కర్మచేౌతున్నాడు. నిజమైన అతని భక్తుల్ని భగవంతుడు అప్రాకృతమైన కర్మలతో చూస్తాడనడంలో సందేహంలేదు. సూర్యోదయం కావటంతో రఘునాధుడు కళ్ళుతెరిచాడు. లేస్తూనే అతడు జాగరూకుడయ్యాడు. తన మనసులో ఇలా అనుకున్నాడు.

"నేనిప్పుడు ఎక్కడ ఉన్నాను, సింహద్వారం ఏమిటి? ఇది పూరీ పట్నంలా తోచడంలేదు. అయితే ఇది ఏ నగరం అయియుంటుంది. ఎదురుగా ఉన్న ఈ సుందర భవనం ఎవరిదై ఉంటుంది? పోనీ ఇక్కడ ఎరిగున్నవారెవరైనా ఉన్నారా అంటే అలాంటి పరిచయస్థులెవరూ కానరాలేదు".

వివాహం జరిగాక రఘునాధుడెన్నడూ అత్తవారింటికి వెళ్ళలేదు. అతడు ఏమీ పోల్చుకోలేకపోయాడు. కొద్దసేపలాగడిచాక, అతడు వచ్చే పోయేవారిని ఇలా ప్రశ్నించాడు. "ఇది ఏపట్నం? ఇంతపెద్ద భవనం ఎవరిది? అని అడిగాడు".

"ఈ ఊరిపేరు కళావతీపురం. ఈ భవనం శ్రీమంతుడైన గంగాధర్ గారిది" అన్నారు.

ఈ మాటలువిన్న రఘునాధుడు ఆశ్చర్యపోయాడు. తరువాత తన ధ్యానంలోకి వెళ్ళిపోయాడు. భగవత్స్మరణలో మునిగిపోయాడు. అప్పుడతని కన్నులనుండి నీటిధారలుబొటబొట రాలసాగాయి. అతడు మనసులో ఇలా అనుకున్నాడు. "ఓ భగవంతుడా! నువ్వుతప్ప ఇలా ఆడించగల వారెవరు? నా మానసిక బాధను తెలుసుకొని అపారమైన దయచూపావు. నీకు సాధ్యంకానిదేముంది? ఈ బ్రహ్మాండమంతా నీ

సంకల్పమాత్రంగా పుడుతూ నాశనమవుతు ఉంది. అలాంటప్పుడు ఇదెంత మాట?".

రఘునాధుడు తనువు, మనసు మరిచి భగవద్విషయం మాట్లాడుతున్నాడు. అంతలో ఆ భవనంనుండి బావమరదులు బైటికొచ్చి రఘునాధుణ్ణి చూసి పోల్చుకొని గబగబలోపలికి వెళ్ళి చెప్పారు. గృహంలోనివారు రఘునాధుని రాకను విని వెంటనే బైటకు వచ్చిచూశారు. చింపిరిగుడ్డ ధరించి ఉన్న ఆవ్యక్తి మరెవరోకాదు రఘునాధుడే. ఇంట్లోని వారిముఖాలన్నీ మాడిపోయాయి. వారు మనసులో ఇలా అనుకున్నారు. కొత్తగా ఈ కష్టం వచ్చిపడిందేమిటి? కాని, అన్నపూర్ణకు మాత్రం చాలా ఊరటకలిగింది. ఆమె మనసులో భగవంతుడికెన్నో ధన్యవాదాలు చెప్పుకుంది. మనసులో ఏమున్నా గంగాధరుడు వచ్చి అల్లుణ్ణి లోపలికి తీసికెళ్ళాడు. స్నానం చేయించి, శుభ్రమైన దుస్తులు అతనిచే ధరింపచేశారు. భోజనం సిద్ధపరిచారు. రఘునాధుడు భగవంతునికి నివేదించి భోజనం చేశాడు.

భోజనాలయ్యాక రఘునాధుని విశ్రమించమనిచెప్పి ఇంట్లోవారంతా తమతమ చోట్లకువెళ్ళారు. పతివ్రత అయిన అన్నపూర్ణ భర్తని సమీపించి అతనికి పాదసేవచేయసాగింది. ఇరువురి హృదయాలు ఆనంద తరంగితాలయ్యాయి. వీరి దాంపత్యాన్ని విఫలం చేయాలని గంగాధరుడు, అతని ఏడుగురు కుమారులు, భార్యాకలిసి నిర్ణయించుకున్నారు. వారిని ఓ మారుమూల గదిలోకి పంపి అక్కడ రఘునాధుణ్ణి చంపాలని గంగాధరుని కుటుంబమంతా నిశ్చయించుకుంది. రఘునాధుని చంపితే అన్నపూర్ణమాటేమిటి? అన్నపూర్ణని గురించి ఏ చింతా అవసరంలేదు. రఘునాధుడు చనిపోతే అన్నపూర్ణ అనాధ అవుతుందన్నది లేదు. మంత్రిపుత్రుడితో వివాహమైతే సుఖాలకి అంతు ఉండదు.

మూర్ఖుడైన తండ్రికి, పవిత్రహృదయంగల అన్నపూర్ణ సుఖదుఃఖాలు ఎలా అర్థమౌతాయి. తాము అనుకున్నప్రకారం పని జరగాలని, విషాన్ని సేకరించాడు అన్నపూర్ణ సోదరుడు. ఈ విషాన్ని భోజనంలో కలపాలి.



ఇంతలో సాయంకాలం అయింది. వంటకాలు తయారుచేయడం మొదలుపెట్టారు. గంగాధరుడి భార్య అన్నివంటకాల్లో విషంకలిపింది.

తల్లిదండ్రుల, సోదరుల తీరుతెన్నులు చూస్తుంటే అన్నపూర్ణకి సందేహం కలుగసాగింది. వంటలో తల్లికి సహాయం చేయాలని వంటింటికి వెళ్ళింది. దుష్టురాలైన ఆ తల్లి కూతురుతో, "అమ్మా! ఈ వేళకూడా నీకీ వంటింటి గొడవ ఎందుకు? ఇది నేను చూసుకుంటాను. రాకరాక అల్లుడు ఇన్నాళ్ళకి వచ్చాడు, నువ్వువెళ్ళి అతనికి సేవచెయ్యి అనగానే అన్నపూర్ణ అలాగేఅంటూ అసలు కుట్రతెలుసుకోవడానికి అక్కడే ఉండిపోయింది. కొద్ది సేపయ్యేసరికి మొత్తం సంగతంతా అర్థమైంది. తల్లిదండ్రులు చేస్తున్న కుట్రలను తెలుసున్న అన్నపూర్ణ చాలా కోపించి ఒక నిశ్చయానికొచ్చింది. భర్తదగ్గరకి, వెళ్ళి అతనికి జాగ్రత్తగా ఉండమని చెప్పాలనుకుంది. అంతలోనే సోదరుడు రఘునాధుణ్ణి బైటకి తీసికెళ్ళాడు. భర్తని సావధానముగా ఉండుమని హెచ్చరించడానికి వచ్చిన అన్నపూర్ణ భర్త కనిపించక కంగారుపడింది. ఎంతగానో విచారించసాగింది. ఎలా భర్తని రక్షించుకోవడమా" అని ఆలోచించసాగింది.

భగవంతుడు అన్నపూర్ణకి తెలివితేటలిచ్చాడు. అన్నపూర్ణ అప్పుడొక తాటాకుముక్క తీసుకొని దాని మీద 'అన్నంలో విషం కలపబడింది, దాన్ని భుజించకండి' అని వ్రాసి దాంతో వంటగదిలోకి వెళ్ళింది. అక్కడ తల్లి ఆమెను చూసి "అమ్మా! కొద్దిసేపు ఇక్కడ నిలబడు, నేనువెళ్ళి భోజన సామాగ్రిని ఈ ప్రక్కగదిలో పెట్టివస్తాను, అల్లుడుగారికి భోజనము పెట్టడానికి ఏర్పాటు అక్కడ చేయబడింది" అంది.

అన్నపూర్ణ కోరుకుంటోంది ఇదే. భగవంతుడి దయవల్ల అదే దొరికింది. అన్నపూర్ణ త్వరగావెళ్ళి ఓ పిండివంటమీద తను వ్రాసిన తాటాకుముక్క పెట్టింది. వెనక అత్తవారింట్లో ఉన్నప్పుడు తన భర్తకి ఇష్టమైన పిండివంటకం ఏదో తెలుసు సాధ్యమైనంతగా ఆ పిండివంటే తన భర్త ముందుగా తింటాడని ఆమెకు తెలుసు.

బంగారపుపళ్ళెం పెట్టి భోజనానికి రమ్మని అత్తగారు కబురుచేసింది. ఆమె మనసులో అల్లుడి చావుకోరుకుంటున్నా పైకి ఆదరసత్కారాల్లో ఏలోటు చూపడం లేదు. రఘునాధుడికీ మరణ ప్రయత్నమేమితెలీదు. కాళ్ళు చేతులు కడుక్కొని భోజనానికి పీటమీద కూర్చున్నాడు. అతడు ప్రసన్నచిత్తంతో భగవంతుడైన శ్రీజగన్నాధునికి నైవేద్యంపెట్టాడు. అనంతరం ఆచమనం చేశాడు. అన్నపూర్ణచాటుగా ఉండి దూరంనుండి చూస్తోంది. ఆమె హృదయం కంపించిపోతోంది. అక్కడ నిలబడటం ఆమెకు చాలా కష్టంగా ఉంది. అయినా అతనికోసం నిలబడకతప్పటం లేదు. ఎలాగో కష్టంమీద కర్తవ్యతాదృష్టితో నిలబడే ఉంది. అక్కడంతా చీకటిమయం. మనసులో అన్నపూర్ణ చాలా గాభరాపడి పోతోంది. విషపదార్థంతిని భర్త ఎలాంటి అనర్థం పాలవుతాడోనని భయపడిపోతోంది. విస్తట్లో వడ్డించిన పదార్థములు విషపూరితంగా ఉన్నాయి. పోనీ అతని ముందుకువెళ్ళి చెబుదామా అంటే సిగ్గుగాను, భయంగాను ఉంది. భగవంతుడి దయఉండబట్టి భర్త పిండివంటమీద చెయ్యివేశాడు. తానువ్రాసి ఉంచిన తాటాకు ముక్క చేతికి తగిలింది. దాన్ని అతను చూశాడు ఆ ఇంట్లో తనని చంపడానికి కుట్రజరుగుతోందని అతను అర్థంచేసుకున్నాడు. అల్లుడు భోజనం చేయడం ఆరంభించాడని గమనించిన తల్లి అన్నపూర్ణని దూరంగా ఆయా దగ్గరికి వెళ్ళమని కేకవేసింది. అక్కడతాను ఉంటే భర్తకి ఏమి ఇబ్బంది కలుగుతుందోనని మనస్సులో భయపడసాగింది అన్నపూర్ణ. కాని తిరిగి కాస్త ధైర్యంచిక్కింది. ఎందుకంటే ఆమె వ్రాసిన మాటలు చదువుకున్నాడు కనుక ఆ విస్తట్లో వడ్డించి ఉన్న పదార్థాలేవీ అతడు తినడని, అది విషపూరితాహారమని అతను గ్రహించాడనుకుంది.

ఇప్పుడు రఘునాధుడు గొప్పసందేహంలో పడిపోయాడు. చేతిలో ఉన్న పిండివంటకం అలాగే ఉంది. అతను ఆలోచించడం మొదలుపెట్టాడు. నేనెంత పనిచేశాను? భగవంతునికి విషపూరితమైన ఆహారాన్ని నివేదన చేశానే, ఓ భగవంతుడా! ఇప్పుడు నాకు కర్తవ్యమేమిటో ఉపదేశించు ప్రభూ! నాకిప్పుడేం చెయ్యాలో అర్థంకాకుండా ఉంది. భగవంతునికి నివేదించిన ఆహారాన్ని తినకుండా ఎలా ఉండను? విషాహారం అని



భగవంతుని ప్రసాదాన్ని నేను తిరస్కరించడం భావ్యమా? భగవంతుని ప్రసాదంతిని మరణిస్తే మటుకు తప్పేముంది? ప్రసాదాన్ని తినక, మరణించక, బ్రతికి ఉండి ఏం చేస్తాను? ఈ వేళచావురాసి ఉంటే అలాగే జరుగుతుంది. భగవంతునికి నివేదన చేసిన ప్రసాదాన్నితిని చచ్చిపోతానని భయంతో ఈ ప్రసాదాన్ని నిరాదరణచేయలేను. ప్రాణం ఉన్నాసరే పోయినాసరే లెక్కించను. అయినా నా ప్రాణానికేమి ఫరవాలేదు.

భక్తుడు ఈవిధంగా చేసిన పవిత్రమైన ఆలోచనని భగవంతుడు భక్తిగానే స్వీకరించాడు. ఆ విషాహారంలోని విషం అంతా తొలగించాడు. అదంతా అమృతంగా మారిపోయింది. భగవంతుడిలీల ఏమని చెప్పగలం! భగవంతుని కారణంగా విషాహారం అమృతంగా మారిన సంఘటనలు లేకపోలేదు. పూర్వం ప్రహ్లాదుడికి పెట్టిన విషాహారం అమృతంగా మారింది కదా! మీరా అనే భక్తురాలికి పెట్టిన విషం అమృతంగా మారలేదా?. "ఈ రోజుకూడా ఉచితమైన పని చేయాలనుకున్నాడు" భగవంతుడు. ఆయన లీల ధన్య మైనది.

రఘునాధుడు ఆహారం విషపూరితం అయిందని తెలిసికూడా భగవత్ప్రసాదాన్ని వీడజాలక గోవిందనామాలను తిరిగితిరిగి స్మరించుకుంటూ భుజించాడు. కంచంలో ఒక్క కణంకూడా విడిచిపెట్టకుండా తినేశాడు. ఆ విషప్రభావం కనపడసాగింది. రఘునాధుడు నిశ్చేష్టుడైపడి పోయాడు. గిలగిలతన్నుకుంటుండగా ప్రాణం ఎగిరిపోయింది. ఇది చూసి గంగాధరుడి భార్య చాలా సంతోషించింది. ఆమె గబగబవెళ్ళి తన భర్తకీ, సంతానానికి ఈ వార్తచెప్పి తీసుకొచ్చింది. అందరూ సంతోషసాగరంలో మునిగిపోయారు. "తెల్లవారగానే మట్టిలో కప్పెట్టేయాలి. మీరంతా బైటవాళ్ళకి ఏం చెప్పాలంటే చీకట్లో రాత్రివేళ పాము కరచి చచ్చిపోయాడని చెప్పాలి" అనుకొని తలుపులన్నీ మూసేసి వారందరూ అక్కణ్ణించి దూరంగా వెళ్ళిపోయారు.

అన్నపూర్ణ తల్లిమాటవిని అక్కడ నుంచి దాయిమా దగ్గరకు వచ్చిందేగాని ఆమె మనసు శాంతిగా లేదు. ఏం అనర్థం జరుగుతుందోనని

ఆమె ప్రాణం గిలగిలాకొట్టుకుంటోంది. కంచంలో విషాహారాన్ని కళ్ళారా చూసిన ఏ పతివ్రత మనసు శాంతిగా ఉంటుంది, తన గదిలో ఈ విషయాన్ని గురించి ఆలోచించుతూ పచార్లు చేస్తోంది అన్నపూర్ణ. తల్లిదండ్రుల రాకపోకలు సోదరుల గుసగుసల మూలంగా అన్నపూర్ణ మనసులో పెద్దసందేహం కలిగింది. అందరూ వెళ్ళిపోయిన తర్వాత ఆమె మెల్లిగా తన గదినుంచి బైటకివచ్చి ఆ గది వైపుగా నడవసాగింది. తన భర్తకి భోజనం వడ్డించిన గది దగ్గరకి వెళ్ళి చూడగా ఆ గది తలుపులు మూసేసి ఉన్నాయి. లోపల దీపంవెలుగులో తలుపుల సందులో నుంచి చూసేసరికి పడిపోయి ఉన్న రఘునాధుడు కన్పించాడు.

"అయ్యో! నా జీవితసర్వస్వం భోజనం చేసిన దగ్గరే పడిపోయాడే! అనుకుంటూ చూస్తున్న ఆమెకి శరీరమంతా వణికి పోయింది. మూర్ఛపోయింది. కొంతసేపటికి మేలుకొని నాలుగు దిక్కులు చూసింది. లోపల వెలుగుతున్న దీపంకూడా ఆరిపోయింది. అక్కడంతా నిశ్శబ్దం. ఆమె ఇలా ఆలోచించింది. దుర్బలులకు బలమెవ్వరు! భగవంతుడు."

ఏ ఆధారములేక ఊగిసలాడే మనసు, నిశ్చితమైన ఆధారం కనిపడితే అటువైపుకే సాగుతుంది. నిశ్శబ్దంలోనుండి వచ్చిన పిలుపు త్వరగా వ్యాపిస్తుంది. భేరీవాద్యం యొక్క ధ్వని నాలుగుకోసుల దూరంవినబడితే, వజ్రంయొక్క ధ్వని 48 కోసులదూరంగా వెడుతుంది. కాని, భక్తుని అంతర్గతమైన పిలుపు మొత్తం ప్రపంచమంతా వ్యాపిస్తుంది. రోదసీని ఛేదించుకొని భగవంతుని పరమధామానికి చేరుతుంది. హరి! నారాయణా! అనన్యశరణాగతా! అంటూ అన్నపూర్ణ చేస్తున్న మనోవ్యథతో కూడిన మౌనమైన పిలుపు భగవంతుడి చెవులకు అందింది. భక్తుల కష్టాలకారణంగా భయంతో, బాధతో, ఆర్తితో కూడిన పిలుపుకి, భగవంతుని సింహాసనం కదిలింది. భక్తులమానసిక బాధలను తొలగించే హరియొక్క హృదయాన్ని గాయపరిచింది. తన భక్తుడైన రఘునాధుని విషమపరిస్థితి చూసి, భక్తుల దుఃఖాలను పోగొట్టు భగవంతుడు చలించిపోయాడు. ఆయన తొందరతొందరగా కలావతీపురం చేరాడు, చీకటిలో వ్యాకులచిత్తంతో నిలుచున్న అన్నపూర్ణ యొక్క గది దగ్గర అలికిడయింది. ఆమె కంగారుపడి



లోపలవైపుకి చూసేసరికి అదంతా గొప్ప కాంతిపుంజంతో ప్రకాశిస్తోంది. అంధకారాన్ని ఛేదించుతున్న ఆ ఘనశ్యాముడు తన భర్త రఘునాధుడి దగ్గరుండి ఓ మణిలా ప్రకాశిస్తున్నాడు. రఘునాధుని శిరస్సు, శరీరాన్ని ఆయన నిమిరాడు. మధురమైన వాక్కులతో భగవంతుడిలా అంటున్నాడు–

"కుమారా! ఇలా చైతన్యరహితుడ వయ్యావేమిటి? ఏ విషము నిన్నేమిచేయలేదు. నేనున్నాను. లేచినిలబడు" అన్నాడు. ఆశ్రితజనపోషకుడయిన శ్రీహరి సంజీవనీ మంత్రంతో చనిపోయిన రఘునాధుడి ప్రాణాలను రప్పించి పునర్జీవితున్ని చేశాడు. రఘునాధుడు నిద్రనుండి లేచిన వాడిలా లేచినిలబడ్డాడు. ఆ దృశ్యాన్ని చూస్తున్న అన్నపూర్ణ ఆశ్చర్యానందాలకు మేరలేదు. ఆమెను ఆవరించి ఉన్న చీకటంతా పటాపంచలయింది. అన్నపూర్ణ సంతోషంపట్టలేక మూర్ఛపోయింది. రఘునాధుడు లేచికుర్చోగానే కాంతిపుంజం అంతా అదృశ్యమైపోయింది. గాఢ నిద్రనుండిలేచిన మనుష్యుడు ఎలా ఆలోచిస్తాడో, రఘునాధుడు కూడా అలాగే ఆలోచించసాగాడు. ఎంత సుఖనిద్రపోయాను. ఇంతనిద్రలో ఉన్న నన్ను ఎవరు లేపారు, అనుకుంటు నాలుగు దిక్కులవైపు చూడసాగాడు. ఎక్కడా ఏమీ కనబడలేదు. భగవంతుడి ప్రేరణతో అతనికి జరిగిన సంఘటనలన్నీ జ్ఞాపకం రాసాగాయి. అతనిలా అనుకోసాగడు, నేను రఘునాధుణ్ణేనా? నేను విషంతిని మరణించాను కదా, ఆ సమయంలో ఎటువంటి దారుణబాధని అనుభవించాను. భరించరాని వ్యధ కలిగింది. నేను మూర్ఛితుణ్ణయ్యాను కదా, నాక్కలిగిన ఆ బాధాజ్వాలని ఎవరు శాంతింపచేశారు? శరీరంలో నుండి ప్రాణంపోయిందికదా, మళ్ళీ ఈ శరీరంలోకి ప్రాణాన్ని ప్రవేశ పెట్టిందెవరు? తెలిసింది స్వామి! ఇది నీపని ఓ కరుణామయుడా! దాసులమీద దయ చూపువాడవునీవే. ఇది నీ క్రీడ. నువ్వు ఎవరిని ఎలా ఆడిస్తావో అది నీకే తెలియాలి. కష్టాలు కలిగించుతావు. మళ్ళా అలాంటి కష్టాలనుండి ఊరట కలిగిస్తావు. ఇలాంటి లీల నీవు తప్ప మరెవరు చేయగలరు? అజ్ఞానులు ఇటువంటి నీ లీలలను ఎలాతెలుసుకుంటారు.

కష్టాలను కలిగించేదే నువ్వే! వాటిని తట్టుకొని నిలబడగలిగే

ఓర్పుని, సమర్థతని కలిగించేది నువ్వే. నేనీ కష్టాలకు వెరవను. ఎందుకంటే ప్రతి కష్టం వెనుక నీ ఓదార్పు, మమత, ఉంటాయి. హృదయయిలోవి జ్వాలల్లాంటి బాధలను శాంతపరిచే ఉపాయాలు చేసేవాడివి నువ్వే అందుకే నిన్ను నేను కష్టాలనిమ్మని కోరుకుంటున్నాను. ఇలా తన హృదయాధినాధుడైన హరిని సంబోధిస్తూ అతనెంతసేపు మాట్లాడాడో, ఏం మాట్లాడాలో చివరికి ఆ హరిస్మరణ చేస్తూ ఈ శరీరాన్ని మరచి తన్మయావస్థలోకి వెళ్ళిపోయాడు.

రఘునాధుని విషబాధాజ్వాల పాపాత్ముల మనసులకి హృదయజ్వాల అయింది. వారి హృదయబాధ రఘునాధుడుపడిన విషబాధకంటే ఎన్నో రెట్లు ఎక్కవగా ఉంది. ఆ రాత్రంతా గంగాధరుడు, అతని భార్య, ఐదుగురు కుమారులు రఘునాధుని బాధనుమించిన మానసికవేదన అనుభవించారు. ఎవరో వెళ్ళి ఈ సంగతంతా రాజదర్బారులో చెప్పారు. సిపాయిలు వచ్చి ఎక్కడ తమని శిక్షిస్తారోనన్న భయంతో, ఆందోళనతో వాళ్ళు నరకమనుభవిస్తున్నారు. ఏ చప్పుడైనా, గబగబ వెళ్ళికిటికీల్లోంచి వీధిలోకి తొంగిచూస్తున్నారు. ఎన్నో ఆలోచనలతో, ఆందోళనలతో వారి మనసులు భయంతో భీభత్సంగా మారిపోయాయి. వీరి కష్టాలను ఇంకా పెంచుతోందా అన్నట్లు రాత్రి అలాగే స్థిరంగా ఉండిపోయింది. చివరికెలాగో వెలుగురేఖలు చూసి ధైర్యం చేసుకొని ఇంట్లోనుండి బైటకువచ్చారు. శవాన్ని త్వరత్వరగా తీసుకువెళ్ళి మట్టిలో కప్పిపెడదామన్న ఉద్దేశ్యంతో వారంతా వంటఇంటికి చేరారు. గంగాధరుడు ముందుగా వెళ్ళి తలుపుతెరిచాడు ప్రాతఃకాలం అయింది. సూర్యకిరణకాంతులు ఇంట్లో పడుతున్నాయి. అక్కడి దృశ్యంచూసి వారు ఆశ్చర్యపోయారు. రఘునాధుడు పీటమీద కూర్చునే ఉన్నాడు. అతని ముఖంలో ఒక దివ్యజ్యోతి వెలుగుతూ ప్రకాశిస్తోంది. నిశ్చలంగా ఉన్న కళ్ళనుండి కన్నీరుకారుతోంది. పెదవులు వణుకుతున్నాయి. కొద్దిగా ఆగి ఆగి అస్పష్టంగా "రామ, కృష్ణ హరి" అనేధ్వని వినబడుతోంది. శరీరకాంతి విలక్షణంగా కనబడుతోంది. అతను ఇంకో లోకంలోని దేవతలా కనిపిస్తున్నాడు. అందరూ అతణ్ణి చూసి ఆశ్చర్యసముద్రంలో మునిగిపోయారు. కోపినా రక్తపుచుక్క కన్పించే స్థితి లేదు. ఆ



వాతావరణంచూసి ఎవ్వరూ ఒక్కమాట కూడా అనడంలేదు. అందరూ లోపలికి వచ్చేశారు, రఘునాధుడలాగే కూర్చున్నాడు. పాదాలధ్వని వింటుకూడా రఘునాధుడు దైవస్మరణలో లీనమై రెండుచేతులు జాచి ఇలా పిలవసాగాడు, "ఓ ప్రభూ! రా!" అంటూ తడబాటుతో నిలబడ్డాడు. కళ్ళుతెరచి మనసులో ఇలా అనుకుంటున్నాడు "అరే! నన్నిక్కడ చంపింది భగవంతుడుకాదు. నా అత్త , మామ, మరదులు. వారందరిని చూస్తు రఘునాధుడలా పీటమీదనే కదలక కూర్చున్నాడు.

ఇప్పుడు గంగాధరుడి శిరస్సు తిరిగిపోతోంది. అతనిలా అనుకోసాగాడు. వీడు మామూలు మనిషికాడు. ఇలాంటి విషంతిని ఎవడైనా బతగ్గలడా, వీడు ఏ దేవతలకోటికీ చెందినవాడు కాదుగదా? అనుకుంటూ రఘునాధుడి పాదాలపైపడ్డాడు. రఘునాధునితో తమను క్షమించమని వేడుకున్నారు.

రఘునాధుడు ప్రసన్న ముఖంతో నవ్వుతూ యిలా అన్నాడు, "ఇందులో మీతప్పేమిలేదు. ఎవరి కర్మను వారనుభవిస్తున్నారు. నేను పూర్వజన్మలో ఎవరికో విషం ఇచ్చి ఉంటాను. అందుచేత ఈ జన్మలో విషాన్నం ఇవ్వబడింది. కర్మఫలాన్ని ఎవరు తోసిపుచ్చలేరు. విషంతిన్నా కూడా నా శరీరంలోని ప్రాణం మళ్ళీ వచ్చింది. దీనిక్కారణమేమంటే నా ప్రాణాలు నావికావు. శ్రీజగన్నాధుడివి. నేను మరొక మాటచెబుతున్నాను వినండి, "మీరు నా దారిద్ర్యాన్ని చూసి మీ అమ్మాయిని ఇంకొకడికిచ్చి వివాహం చేయాలనుకుంటున్నారు. ఇది మీకు తగినదని తోస్తే అలాగే చేయండి. ఇక్కడ నేను మీకు చెప్పదలచుకొన్నది ఏమిటంటే మీకు ధర్మంమీద ఏపాటి భయమున్నా నా భార్యను నా కర్పించండి. ఆమె నా సుఖదుఃఖాలలో పాలు పంచుకొనేది. మీరంగీకరిస్తే ఆమెను నేను నాతోబాటు తీసికెళతాను. ఆమెను పంపడం, పంపకపోవడమన్నది మీ చేతిలో ఉంది. ఈ విషయంలో నేను మీ మీద ఒత్తిడి తీసుకురాను.

ఈ మాటలంటూ రఘునాధుడు గట్టిగా, "ముకుందా! మాధవా! మురారీ!" అంటూ ఉచ్చరిస్తు ఇంటినుండి బైటకు వచ్చి మార్గమధ్యంగా

నిలబడ్డాడు.

పెద్దలతోనూ, పుత్రులతోనూ కలిసి గంగాధరుడు రఘునాధుడి వెనకే పరుగుపరుగున వెళ్ళి అతని చేతులు పట్టుకొని "మీరు ఈ వేళకి ఆగండి. మీతో మీభార్యనిచ్చి పంపుతాను. ఇందులో నా మూలంగా ఏ విధంగా అడ్డంకి ఉండదు" అన్నాడు.

ఆ మాటలు విన్న రఘునాధుడు అక్కడే ఉన్న చెట్టుకింద నీడలో కూర్చున్నాడు. ఆ తరువాత రఘునాధుడు మళ్ళీ వారింటికి వెళ్ళలేదు. అతడు ఓ నిశ్చయానికి వచ్చాడు. ఏమనగా, "ఇక్కడికి నన్ను తెచ్చింది జగన్నాధ ప్రభువు. ఆయనే నన్ను బ్రతికించాడు. అన్నపూర్ణకెలా న్యాయం జరగాలో ఆయనే చేస్తాడు" అనుకున్నాడు. గంగాధరుడు అల్లుణ్ణి లోపలికి రమ్మని చాలావిధాలుగా చెప్పి చూశాడు. లాభంలేకపోయింది. చేసేది లేక గంగాధరుడు సపరివారంతో లోపలకి పోయాడు.

అన్నపూర్ణ మూర్ఛనుండి తేరుకుని కనులు తెరిచింది. భర్త బ్రతికే ఉన్నాడని తెలుసుకుంది. ఆమె తన గదిలోకి వెళ్ళిపోయింది. అన్నపూర్ణ ఇంట్లోని తల్లిదండ్రులకి సోదరులకి భయపడుతూనే ఉంది. దుర్మార్గుడైన తండ్రి, తన కుమారులతో కలిసి, ఆమెను గదిలో పెట్టి బంధించేశారు. ఆమె బైటికిరాలేక అలా ఆగదిలోనే భర్తసంగతేమీ తెలియక, పంజరంలో బంధించబడిన పక్షిలా లోలోపలే బాధపడుతున్నది. గంగాధరుడు అన్నపూర్ణ ఉన్నగది దగ్గరకొచ్చి, గదిలోకి ప్రవేశించి ఆమెనిలా అడిగాడు, "అన్నపూర్ణా! నువ్వు చెప్పు, బిచ్చం అడుక్కుని బతుకుతున్న భర్తతో వెడతావా, మాతో బాటు ఉండడానికి ఇష్టపడతావా?" అని.

ఈ ప్రశ్న అన్నపూర్ణ హృదయానికి గుచ్చుకున్నట్లయింది.

"నీ భర్త నిన్ను భరించలేడు" అన్న భావం ఆమాటల్లో కన్పించింది. ఆ మాటలకి సమాధానంగా అన్నపూర్ణ సిగ్గుతోనైనా, దృఢంగా బదులు ఇలా చెప్పింది.



"తండ్రీ! నేనిలా చెబుతున్నందుకు క్షమించండి. నేను నా భర్తతో వెళ్ళడానికే నిశ్చయించుకున్నాను. భర్త బికారిగాని, ఎటువంటివాడైనాగాని ఆయన భార్యకు దేవుడేకదా!" అని చెబుతూ దుఃఖం, రోషం, సిగ్గు పక్కకిపెట్టి స్థిరంగా, ధైర్యంగ, సింహంగర్జిస్తున్న రీతిలో మాట్లాడసాగింది. ఆమె కళ్ళనుండి ఇప్పుడు కారుతున్నవి కన్నీళ్ళుకావు, కోపాగ్నికణాలు, అవి విస్ఫులింగాలవలె ఎగురుతుండగా జవాబులిస్తోంది. ఇప్పటి అన్నపూర్ణ అమాయకపు బాలిక కాదు. రాక్షసమూకల్ని కనుచూపుతో భస్మం చేసిపారేసిన దుర్గ.

తండ్రికేసి చూస్తూ అన్నపూర్ణ యిలా అంది, "తండ్రీ! నన్నేం చేద్దామనుకుంటున్నారు? భర్తచే వంచించబడిన దాన్నిచేసి నన్ను పరపురుషునితో కలపడానికి యోచించడం లేదు కదా!. ఇది సాగదు. నన్నింకా పసిపిల్లగా భావించకండి నా కంఠంలో ప్రాణం ఉన్నంతవరకూ నా శరీరంమీద పరపురుషుడి చేయిపడటానికి ఒప్పుకునేదిలేదు. ఇది ఎప్పటికీ సాగదు. ఇది నా నిశ్చయమైన అభిప్రాయం. ఇదే జరగడానికి సిద్ధమయితే నేను ఆత్మహత్య చేసుకుంటాను. ఇక సతిశాపం మూలంగా పచ్చటి ఈ సంసారం భస్మమవుతుంది".

నీటిలో వేడి ఎంతవరకు ఉంటుంది నీటి సహజ ధర్మం చలవ. అదే విధంగా శాంతం, సరళత అన్నపూర్ణకుగల సహజ గుణాలు కావడంచేత అన్నపూర్ణకోపం కూడా ఎక్కువసేపు ఉండలేదు. ఆమె తండ్రి పాదాలుపట్టుకొని భయపడుతూ వణుకుతున్న కంఠంతో ఇలా చెప్పసాగింది.

"తండ్రీ! నన్ను క్షమించండి. నన్ను నా భర్తతో వెళ్ళనీయండి. వారే నా ఏకైక జీవనం. నన్ను నా భర్తకు దూరంచేయటం మీకు మంచిదికాదు. అంచేత నేను రెండు చేతులూ జోడించి చెబుతున్నాను. నన్ను నా భర్తతో వెళ్ళడానికి అనుజ్ఞ ఇవ్వండి" అన్నది.

రఘునాధుని ప్రభావం అన్నపూర్ణయొక్క మనోభావం గమనించి కొంతభయపడి అందరూ కలిసి ఆలోచించి అనపూర్ణని రఘునాధుడితో

పంపడానికి నిశ్చయించారు. గంగాధరుడు డబ్బు, రత్నాలు తీసుకొని అన్నపూర్ణకిచ్చి సరళ హృదయంతో, "అమ్మా! ఇవితీసుకొని నీ భర్తతో వెళ్ళు. నామీద దయ ఉంచు. ఏ అశుభాలు మాకు జరక్కుండా చూడు". అన్నపూర్ణ అవి తీసుకొని వచ్చి, భర్తకు నమస్కరించి "ప్రాణప్రియా! ఎక్కడికి వెళ్ళాలో బయలుదేరండి త్వరగా ఇంక ఇక్కడ ఒక్క నిముషం కూడా ఉండడం తగదు. మీ పాదదాసి మీతో రావడానికి సిద్ధంగా ఉంది" అన్నది. రఘునాధుడు భార్యచేతిని పట్టుకొని "జయజగన్నాధ" అంటూ పూరీ పట్టణానికి ప్రయాణమయ్యాడు. గంగాధరుడు ఇంట్లోకి వచ్చేశాడు. కూతురు అన్నపూర్ణని ఓ ముష్టివాడితో పంపినందుకు చాలా మనస్తాపపడుతున్నాడు. అన్నపూర్ణ తల్లికి మాత్రం పాపబుద్ధిపోలేదు. వారి మీద కసిపెట్టుకొని, ఎలాగైనా కసి తీర్చుకోడానికి ఆలోచన చేయసాగింది. ఆమె మంత్రి కుమారుని దగ్గరకు మనిషిని పంపి "అన్నపూర్ణని దుర్మార్గుడు లేవతీసుకుపోతున్నాడు, వాణ్ణి చితకబాది ఆమెను వెనక్కి తీసుకురావలసిందని" చెప్పి పంపింది.

ఈ వార్త అందగానే మంత్రి కుమారుడు గుర్రపుదండును తీసుకొని, తగిన మందీమార్బలంతో రఘునాధుణ్ణి వెదకడానికి బైయలుదేరాడు. నడిచివెళ్ళే వారిని కలిసేందుకు గుర్రాలమీద వెళ్ళేవారికి ఎంతసేపు పడుతుంది, గుర్రాలడెక్కలధ్వని, దుమ్ముధూళి ఎగిరి ఆకాశమంతా రంగుమారిపోయింది. సైన్యపు హడావుడితో మంత్రి కుమారుడు ముందుకు సాగుతున్నాడు. దాన్ని చూస్తుంటే రఘునాధునికి చాలా ఆశ్చర్యం వేసింది. చూస్తుండగానే ఆ దుర్మార్గుడు దగ్గరగా వచ్చికేకలు కూడా వేయసాగాడు.

"ఎవర్రా నువ్వు! దుర్మార్గుడా! నా ప్రియురాలిని తీసుకు పోతున్నావు, ఎక్కడికి పరిగెడుతున్నావు, ఈ సుందరిని ఇక్కడ విడిచిపెట్టిపో, లేదా నీ ప్రాణాలు తీస్తాను" అన్నాడు.

రఘునాధుడు అతనికేసి చూశాడు. ఇది భగవానుడు చూపుతున్న మరో కొత్తలీల అనుకున్నాడు. జగన్నాధుని మనసులో తలచుకుంటూ భక్తిలో నిమగ్నుడయ్యాడు. మంత్రికుమారుని చూసి రఘునాధుడు



నవ్వుతున్నాడు. అన్నపూర్ణ మాత్రం చాలా భయపడింది.

మా నాన్న ఈ దుష్టుడికే నన్ను ఇవ్వాలనిచూశాడు ఇప్పుడు వీడిబారినుండి బయటపడ్డమెలా అంటున్న అన్నపూర్ణ మాటలు వింటూన్న రఘునాధుడు నవ్వుతూ, "నువ్వు ఎందుకింత భయపడుతున్నావు. పిచ్చిదానా! నా రక్షకుడు జగన్నాధస్వామి అని నీకు తెలియదా, ఇదో కష్టమా, అసలు నీకు తెలుసా, నీతో నన్ను కలిపింది, విపంతిన్నా నన్ను రక్షించింది ఎవరనుకున్నావ్? భయపడకు. ఈ కష్టంనుండి ఆయనే కాపాడుతాడు. బ్రహ్మాదులు, ఇంద్రాది దేవతలు, సదా తమ మనసుల్లో ధ్యానించే ఆ లీలావిగ్రహుడు, నిత్యరక్షకుడు ఆ స్వామి కాపాడతాడని నమ్ము. దేవగణాలన్నీ ఆయన పాదాలకి మొక్కి ఆయననే మనసులో ధ్యానించి ఆనందిస్తూంటారు. అటువంటి ఆ స్వామి రక్షకుడై ఉండగా భయందేనికి అన్నపూర్ణ! ఆ స్వామి లీలను చూస్తుండు. సర్వజగత్ప్రభువు యొక్క లీలలలో ఇదొకటి".

ఇలా రఘునాధుడు భార్యతో చెబుతుండగానే ఇద్దరు రాజకుమారులు మంచి వేగంతో గుర్రాలమీద వచ్చివారి దగ్గర నిలిచారు. వారు శస్త్రాస్త్రాలతో ఉన్నారు. వారు రఘునాధుణ్ణి చూస్తు, "నువ్వెవరు? నీతో వున్న ఈ సుందరాంగి ఎవరు? నీ వెనకాల ఈ సేన ఎవరిది? ఎందుకు, ఎవరివైపు వస్తోంది?" అన్నారు.

రఘునాధుడు వారికి విషయమంతా వివరించాడు. "ఈమె నా భార్య, నేనొక అనాధుణ్ణి. నాకు రక్షకుడైన భగవంతుడు చక్రపాణి తప్పితే మరొకరులేరు. నాకు ఆయనకన్నా ఏ ఇతర ఆధారమూ లేదు. ఇంతకన్నా నాకు శరణు ఇచ్చేవారు కాని, రక్షకుడు కాని ఎవ్వరూ లేరు. అందుచేత వ్యాకులప్రాణులకి ఆయన దయే ఉండడం చూస్తున్నాను. ఆ మాటలువిని రాజపుత్రులన్నారు, "మీకేమి భయం లేదు. మేము నీతోబాటే వస్తున్నాం, మీమీద ఎవరు అఘాయిత్యం చేస్తారు?" అన్నారు.

రఘునాధుడు ఇదంతా భగవంతుడిలీల అనుకున్నాడు. అతను

అతని భార్య నిర్భయంగా రాజపుత్రుల అండ దండలుండగా ముందుకు సాగిపోతున్నారు. మంత్రిపుత్రుల సేనకంటె రాజ కుమారులసేన లక్షల్లో పెరిగింది. వీరందరూ రఘునాధుని, అన్నపూర్ణని కాపాడుతున్నారు. మంత్రి కుమారుడు, అతడి సేన గుప్పెట్లో ప్రాణాలుపెట్టుకొని పరుగుతీశారు. సర్పాన్ని చూసిన కప్ప అటూ ఇటూ పరుగులు తీసినట్లుగా మంత్రికుమారుడు, అతడి సేన, ఈ రాజకుమారులని, వారిసైన్యాన్ని చూసి భయంతో పారిపోయారు. రఘునాధుడికి అన్నపూర్ణకి ఈ రాకుమారులెవరో అర్థం కాలేదు. రఘునాధుని, అన్నపూర్ణని చూసి రాజకుమారులు, "ఇంక మీకేమీ భయంలేదు. మేం వెళ్ళిపోతున్నాం మాకుచాలా పనులున్నాయి" అనగానే రఘునాధుడు వారిని చూస్తూ, "మీకు వేల ప్రణామాలు, మీరెవరోకాని, మమ్మల్ని దుష్టులబారి నుండి రక్షించారు. మీరు మాకు ప్రాణదానం చేశారు. మీ పాదాలకి వందనాలు" అన్నాడు.

ఆ ఇద్దరు వీరులూ నవ్వుకుంటూ అక్కడ్డించి వెళ్ళిపోయారు. వారిద్దరు సాక్షాత్తు నరనారాయణులు. వారు తీరికలేకుండా ఎన్నో పనులలో ఉంటారు. కాని రఘునాధుడు వారెవరో తెలుసుకోలేక పోయాడు. అతని నిశ్చయం తిరుగులేనిది. ఏమంటే దయామయుడైన జగన్నాధుని రక్షణకారణంగా ఇంతటి గొప్ప ఆపదనుండి బైటపడగలిగాడు. కొద్దిరోజుల అనంతరం రఘునాధ దంపతులు పూరీచేరుకున్నారు. భగవంతుడైన జగన్నాధుని చూడగానే అతని అలసట, కష్టాలు పోయాయి. తండ్రి ఇచ్చిన డబ్బుతో అన్నపూర్ణ ఆలయానికి దక్షిణదిశగా ఓ ఇల్లు కొనుక్కొంది.

అందులో అన్నపూర్ణ రఘునాధుడు హాయిగానూ, సుఖంగానూ కాలం గడుపుతున్నారు. వారిద్దరి పనీ కృష్ణుడి కథలు చెప్పటం. కృష్ణనామ సంకీర్తనం చేయటం, కృష్ణునిగుణాలను వినడం కృష్ణునిలో లీనం అయిపోయి నాట్యం చేయడం. ఆనందంతో కన్నీరు విడవడం. ఇది వారి దినచర్యగా సాగుతోంది.

భగవంతుని భావాన్ననుసరించి భక్తుడి భావం ఉంటుంది. భక్తుడి భావాన్ని చూడగలం. కాని, భగవంతుని భావం తెలుసుకోవడం అందరికీ



సాధ్యపడు విషయంకాదు. అటువంటి అదృష్టము అందరికీ సాధ్యపడదు. భగవంతుడనగా అన్ని రసాల స్వరూపం. భావమాధుర్యాల ప్రవాహం ఆ రససరస్సులో మునిగితేలుతూ అదే భావాలలో ఉంటూ తననుతాను మరిచిపోయి ధృఢమైన భక్తితో నర్తించుతూ, పాడుతుంటాడు. అటువంటి ఉత్తమ తరగతికి చెందిన భక్తుణ్ణి చూస్తుంటే నాస్తికుడి కన్నులనుంచి అశ్రువులు ఒలుకుతున్నాయి. భక్తి మత్తులో పడిపోయిన భక్తుడు భగవంతుని దర్శించుతాడు. అది అత్యంత సుందరం మరియు మనోహరమైనది. ఇటువంటి అనుభూతిని పొందిన వానికే దాని గుణంతెలుస్తుంది. ఆ మాధుర్యాన్ని, ఆ అనుభూతులను మాటలలో చెప్పలేరు. అటువంటి సమయంలో భగవంతుడు విలక్షణంగా కనబడతాడు. భక్తుడి మధురమైన హృదయంలో భగవానుని మనోహర ప్రకృతి విశదమవుతుంది. ఇటువంటి భగవన్మూర్తి భాగ్యం అందరికి కలిగేదికాదు. మనోనేత్రంతో అటువంటి మధురమూర్తిని రఘునాధుడు దర్శించుతున్నాడు.

రఘునాధుని ఎదుట జగన్నాధుడు, జగన్నాధుని ఎదుట రఘునాధుడు మూర్తి మంతులయి ఉంటున్నారు. (అటువంటి భావనలోనికి వెళ్ళినవాడు నిత్యనూతన మధుర మహానందమయ సముద్రంలో ఓల లాడవచ్చును.) అటువంటి భావనలోకి వెళ్ళినవాడు బ్రహ్మనందాన్ని పొందుతున్న వాడగును.

రఘునాధుడు ఒక్కొక్కసారి నర్తిస్తుంటాడు. ఒక్కోసారి భక్త్యావేశంలో భూమ్మీద పొరలాడుతుంటాడు. భగవంతుని భుజస్కంధాలమీద భరించుతూ మర్మవాక్యాలని వినిపిస్తుంటాడు. వారిరువురికీ అర్థమయ్యే మూగభాషలో ఆ సంభాషణ జరుగుతూ ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ప్రభువుయొక్క లీలావేశాలలో నవ్వుతుంటాడు. ఆనందాశ్రువులు రాలుతుండగా సల్లాపాలాడుతుంటాడు. అదే భావనతో అదే ధ్యానంతో "హరిహరి" అంటూ అంతరంగంలో బహిర్గతంగానూ, అంతటినీ హరిమయంగా భావిస్తూ హరిక్షేత్రంలో నివసిస్తున్నాడు. పతివ్రత అయిన అన్నపూర్ణ, పరమారాధ్య దైవం అయిన భగవంతునికీ తన భర్తకూ సేవ

చేస్తూ ధన్యురాలైంది.

----oOo----

## 2. ఆదర్శ దామోదర దంపతులు

కాంచీనగరంలో దామోదరుడనే బ్రాహ్మణుడు ఉండేవాడు. భిక్షమెత్తుకుని జీవించేవాడు. సంతానంలేదు. భార్య ఒక్కతే ఇంట్లో ఉండేది. దామోదరుడిలాంటి దరిద్రుడు భూమ్మీద మరొకడు కనబడ్డం అరుదు. ప్రొద్దున్నే లేచి స్నానసంధ్యావందనాదులు, నిత్యకర్మలు ముగించుకొని, నుదురుమీద చందనం పెట్టుకొని, దేవుని నిర్మాల్యం అయిన తులసీదళాన్ని ధరించి రామునిమీద, కృష్ణుడిమీద, శ్రీహరికి సంబంధించిన కీర్తనలను పాడుకుంటూ నగరంలో భిక్షం అడుక్కుంటూ తిరుగుతూండేవారు. భిక్ష కొంచెం దొరికిందా మంచిదే. అలా భిక్ష దొరక్కపోతే విచారపడేవాడుకాడు. దొరికినదంతా తీసుకొచ్చి భార్యకిస్తే ఆమె వంటచేసేది. ఆ వంటని వారు భగవంతునికి నివేదించి ప్రసాదంగా వారు భుజించేవారు. దాంతో సంతుష్టిచెంది హాయిగా ఉండేవారు. ఎప్పుడైనా ఆకలితో అతిథివస్తే ముందుగా అతనికే భోజనం పెట్టి సంతృప్తిపరిచేవారు. భిక్షదొరకనినాడు ఆ దంపతులు బాధపడకుండా ఆనందంగా ఉపవాసం ఉండేవారు. గోవింద భజనతో కాలం గడిపేవారు. వారు రాత్రింబవళ్ళు భజనచేస్తూ ఆనందంగా ఉండేవారు. పరుల విషయాలను గురించి చర్చించేవారుకాదు. ఎవరినీ నిందించేవారు కారు. హృదయాలు నిర్మలంగా సర్వదా ఉంచుకొనేవారు. ఇంట్లో ఏ పదార్థమూ లేకపోయినా భగవంతుణ్ణి ఏమీ కోరేవారుకారు. ఎప్పుడైనా వారు భగవంతుణ్ణి ఏదైనా కోరడమంటూ జరిగితే అది "లోక కల్యాణం"గా ఉండేది. వారు పదిమంది మేలునే కోరుకునేవారు.

భజన తత్పరులై ఉన్నవేళ భగవంతుడి దర్శనం లభిస్తే, ఏమీ అడగకుండా ప్రార్థనలు చేసేవారు. "హే భగవాన్! నీ మంగళమూర్తిని చాలామంది చూడక అశుభాలనే శుభాలుగా భావించుచున్నారు. ఓ దేవా! వారిపై దయచూపి, వారికిగల భ్రమలను దూరంచెయ్యి. (నీ



ఆనందదాయకమైన సుధాధారలను వారిపై చల్లి వారి హృదయాలను తడుపు) హింసాద్వేషాలను విడనాడి అందరూ అన్యోన్యంగా ప్రేమతో ఉండేలా చెయ్యి. నీ శుభకరమైన విగ్రహం అందరి హృదయాలలో ఎల్లవేళలా ప్రకాశమానంగా నిలిచేలా చెయ్యి ప్రభూ"అని ప్రార్థించేవారు.

పెట్టెలో పెట్టి ఎంతదాచినా కస్తూరియొక్క సుగంధం బైటికి వస్తూనే ఉంటుంది. అలాగే దామోదరుడి దారిద్ర్యాన్ని ఛేదించుకొని అతని కీర్తిప్రతిష్ఠల సుగంధం దశదిశలా దేశం అంతటా వ్యాపింపజొచ్చింది. మెల్లిగా వ్యాపిస్తూ అతనికీర్తి ఆ దేశప్రభువైన మహామహేశ్వరుడి వరకూ కూడా వ్యాపించింది. ఒకరోజున ఆ ప్రభువు కాంచీనగరం వచ్చాడు. ఈ బ్రాహ్మణుడి కథ సత్యమో, అసత్యమో తెలుసుకొనే ఉద్దేశ్యంతో వచ్చాడా ప్రభువు. ఆయన మాయవేషాలు వేయటంలో ఆరితేరినవాడు.

వస్తూనే వృద్ధసన్న్యాసిలా తయారయ్యాడు. శరీరం చాలా దుర్బలంగా ఒక్క అడుగుకూడా నడవలేనంత నీరసం నటిస్తున్నాడు. ఓ కర్ర ఆధారంతో నడుచుకుంటూ దామోదర దంపతులున్న ప్రాంతానికి వచ్చాడు. సరాసరి వారి వాకిలిముందు నిలబడ్డాడు. దామోదరుడికానాడు పిడికెడు బియ్యంకూడా దొరకలేదు. అతడు రిక్త హస్తాలతోనే ఇంటికి తిరిగి వచ్చాడు. భార్యాభర్తలిరువురూ నేలమీద కూర్చుని భగవంతుని తలచసాగారు.

వారిలా అనుకోసాగారు, "ఓ దేవా! నువ్వు నిగ్రహానుగ్రహ సమర్థుడవు. నీవు ఏది కావాలనుకుంటే అది చేయగలవాడవు. కాని, మా దంపతులకు నీ పాదాలే ఆధారం. నీవే మా ఏకైక రక్షకుడవు. ఇందుచేతనే జనులు నిన్ను దయాసముద్రుడవనీ, దీనులపాలిటి రక్షకుడవనీ అంటారు.

నిజంగా నీవు మాత్రమే దీనులను కాపాడేవాడవు ఇంకెవరూ కన్పించటంలేదు. నీవే అనాథరక్షకుడవు. ఓ ప్రభూ! నీవు దేహంలో ఉండివారి దోషాలన్నిటినీ దూరం చేస్తున్నావు. నీవు దుర్జనులనే కప్పలకి సర్పంలాంటి వాడివి. మదించిన మనుష్యులనే ఏనుగులకి సింహంలాంటివాడవు. నీవు సకల జీవులకు ప్రభుడవు. అత్యంత

క్షుద్రమానవులము, నిన్ను శరణు కోరుతున్నాము. ఓ స్వామీ! ఈ భయంనుండి రక్షించి కాపాడు. నీవు గొప్ప మహత్తుకలవాడవు. ఈరోజిలా నీ భక్తులు భయపడడందేనికి, దేనివల్లా భయపడడం లేదు. ఆఖరికి మరణదేవత వచ్చినాకూడ భయంలేదు. కాని ఒకటే భయం. ఇలాంటి వేళ ఏ అతిథైనావస్తే ఏం చెయ్యలేము"అనే దుర్గతి పడుతుందేమో అన్నది భయం. అతిథికి ఎక్కణ్ణించి ఏమి తెచ్చిపెట్టగలం" అనుకోసాగారు.

పిరికితనం ఉన్నచోటే ధైర్యంకూడా ఉంటుంది. దామోదరుడు, అతని భార్య యీ విషయాన్ని గురించే తలచసాగారు. వారి చెవుల్లో ఏదో నీరసంగా కేక వినపడజొచ్చింది. ఆ కేక "నేనయ్యా! మీ గుమ్మం దగ్గర నిలబడి ఉన్నాను. ఇంట్లో ఎవరున్నారు" అని. గుమ్మందగ్గర సన్నని స్వరంతో కూడిన పిలుపది. ఎవరో అతిథి గుమ్మందగ్గర నిలబడి చేసిన ఆర్తనాదమది దామోదరుడు వినడమే తడవుగా గబగబ బైటికొచ్చాడు.

"అలసిపోయి నీరసించిన ఆకృతి కలిగి, ముసలి తనంతో పట్టులేని అవయవాలతోనూ, తేజోమయుడైన, మహాపురుషుడైన యోగిని" చుశాడు. వెంటనే దామోదరుడు భక్తిభావము కలుగునట్లుగా సాష్టాంగ దండప్రణామంచేశాడు. చాలా నమ్రతకలిగి చేతులుజోడించి ఆ యోగితో ఇలా అన్నాడు. "అయ్యా! మీ కెట్టిసేవ చేయగలనో ఆజ్ఞాపించండి"

"ప్రఖ్యతమైన నీ కీర్తివిన్నాను. నువ్వు వచ్చిన అతిథి అభ్యాగతులను ఆదరించి భోజనం పెడుతుంటావట. నేను తరచుగా మనసారా కోరి అతిథులను ఆదరించి భోజనంపెట్టే వారింట మాత్రమే తింటాను. ఇతరుల ఇళ్ళలో అనగా అశ్రద్ధగా పెట్టేవారింట నేనసలు భుజించను. అటుచూడను కూడా చూడను. శ్రద్ధతో అన్నంపెట్టే వారింట అడిగైనా తింటాను. అతిథులసేవ చేసేవారిపేర్లలో నీ పేరు తరచుగా వింటాను. నువ్వు ప్రేమతో పెట్టే, భోజనం తినాలనే ఆశకలిగింది. ఓ సారి దామోదరుడి ఇంట భోజనం చేద్దామనే సంకల్పం కలిగింది. అందుచేత ఇలా వచ్చాను. ముసలితనం బాధిస్తోంది. కదలడానికి పాదాలలో శక్తిలేదు. నువ్వుపెట్టే అన్నం తినాలన్న కోరికతో ఇంతదూరం కష్టపడివచ్చాను.



అయ్యా! ఒక్క పట్టెడన్నం దొరుకుతుందా?" అన్నాడు భిక్షకుడు.

దామోదరుదాసు ఎందుకోసం బాధపడుతున్నాడో అదే జరిగింది. అతిథి అన్నమాటలు వినగానే అతనికి చాలా బాధనిపించింది. "భగవంతుడి దయ ఎలా ఉంటే అలా అవుతుంది" అనుకొని దామోదరుడు చల్లని నీటితో బ్రాహ్మణుని పాదాలు కడిగి, సన్నని సాదరమైన కంఠస్వరంతో అన్నాడు, "మీరు చాలా అలసి యుండుట చూస్తున్నాను. మీరు ఇదగో ఈ దర్భాసనం మీద కొద్దిక్షణాలు విశ్రాంతి తీసుకోండి. నేనిప్పుడే వస్తాను" అంటూ దామోదరుడు భార్య దగ్గరికి వచ్చి మెల్లిగా అన్నాడిలా, "సతీ! గుమ్మందగ్గర అతిథి వచ్చి ఉన్నాడు ఇంట్లో ఏమీ కనబట్టంలేదు. ఇప్పుడేం చెయ్యాలి?" అనగా, అతని భార్య అతనితో, "ఏం చేద్దాం? ఇంటి గుమ్మం అమ్మినా ఓ రూపాయి కూడా రాదు. పోనీ ఏ గుడ్డయినా నా దగ్గర కనబట్టంలేదు. ఏం చెయ్యడం? చిల్లుబడిపోయి మట్టి కొట్టుకుపోయిన హుండీ ఉంది. అది తరతరాలుగా వస్తువున్నది. అయినాసరే దాన్ని మార్చుదామంటే ఎవరు తీసుకుంటారు?" అంటూ ఆ ఇల్లాలు కనులనీరు పెట్టుకుంది. కన్నీరు పెట్టుకుంటున్న భార్యను చూసి దామోదరుడు కూడా కంటతడిపెడుతూ, ఓ పెద్ద నిట్టూర్పు విడుస్తూ, "ప్రస్తుతం ఏం చేద్దాం? అతిథి సేవ చేయలేనంటావా? అతిథిని ఆకలితో పంపమంటావా? అలాంటప్పుడు జీవించి ప్రయోజనమేమిటి? భగవంతుడా! ఇంత కఠినంగా పరీక్షిస్తున్నావేమయ్యా?" అన్నాడు.

దామోదరుని భార్య చేసేదేమీలేక వ్యాకుల మనస్సుతో, "శ్రీహరీ!" అని మనసారా స్మరించింది. ఆ తర్వాత ఆమె చిరునవ్వు పెదవులపై కదలగా, భర్తతో "ఇంతమాత్రానికే బెంబేలు పడుతున్నారేమిటి? జగత్పతి అయిన జగన్నాధుడు అతిథి కోసమైనా అన్నం ఏర్పరుస్తాడు. ఓ పనిచెయ్యండి. మీరు మంగలి ఇంటికి వెళ్ళి కత్తిత్వరగా తీసుకురండి" అని చెప్పగా విని దామోదరుడు తొందరగావెళ్ళి కత్తి తీసుకువచ్చాడు.

"ఈ కత్తితో ఏం చేస్తావు" అనడిగాడు. అప్పుడు అతని భార్య అతనితో "నాయీ అందమైన కేశపాశం కత్తిరించి దాన్ని సవరం కట్టేవాళ్ళకి

అమ్మి డబ్బుతీసుకువస్తే ప్రస్తుతం పని జరుగుతుంది. ఇప్పుడు మన దగ్గరున్న ఆధారము ఇదే. ఇలాచేస్తే అతిథికి భోజనం సమకూర్చవచ్చు. దీనికోసం చింతించకండి" అంది.

తన భార్య చూపిన ఈ అద్భుతమైన ఉపాయానికి ఎంతగానో మెచ్చుకుంటూ ఆమె అందమైన శిరోజాలను కొంతవరకు కత్తిరించి దాన్ని బజారులో అమ్మి, ఆ డబ్బుతో వంటసామాను తేవడానికి వెళ్ళాడు. అదృష్టవశాత్తు ఒకరు ఆ కేశాలను కొన్నారు. ఆ డబ్బుతో దామోదరుడు బియ్యం, నెయ్యి, పాలు, పెరుగు, కూరగాయలు మొదలైన కావలసిన పదార్థాలనుకొని ఆనందంగా తన భార్య దగ్గరకు వచ్చాడు. ఆమె వంట బాగా చేయగలదు. చూస్తుండగానే ఆమె వంటంతా పూర్తి చేసింది. దామోదరుడు బైటికి వచ్చి అతిథిని ఆతిథ్యం స్వీకరించడానికి రమ్మని ప్రార్థించాడు. ఆయన లోపలకి రాగానే అతని పాదాలు దామోదర దంపతులు శ్రద్ధాభక్తులతో కడిగి ఆ నీటిని తమ శిరస్సులపై చల్లుకొని ఆనందించారు.

దామోదరుని పుణ్యం పండింది. అతని భాగ్యం ఏమని వర్ణించగలరు? భావకమలం ఎక్కడ వికాసం చెందుతుందో అక్కడ మధుపాయి అయిన తుమ్మెదలా భగవంతుడుంటాడు. భావము లేనివాడితో ఆ భగవంతుడు కలవడు. అనగా భావహీనుడైన మానవుడు భగవంతుని కలవలేడు.

బ్రాహ్మణుడి ఇల్లు ఓ శిథిలమైన చిన్నగుడిసె. ఆ గుడిసెలోనే దామోదర దంపతులు సాధువుని కూర్చోబెట్టారు. అరిటాకులో సాధువుకు భోజనాన్ని వడ్డించారు. బ్రాహ్మణుడి భార్య వడ్డన చేయసాగింది. దామోదరుడు విసరుతూండగా, వృద్ధుడు భుజిస్తున్నాడు. అతను చాలా ఆనందంతో తింటున్నాడు. వృద్ధుడగుటవలన నెమ్మదిగా భుజిస్తున్నప్పటికీ అన్నమంతా తినేశాడు. చివరలో "ఈ పదార్థాలు చాలా రుచిగా ఉన్నాయి. ఉంటే మరికొంత వడ్డించు. ఈ రోజు చాలా తృప్తిగా తింటున్నాను" అన్నాడా వృద్ధుడు.



దామోదరుడి భార్య అడుగున మిగిలివున్న అన్నంకూడా తెచ్చి వడ్డించింది. అంతర్యామి అయిన భగవంతుడు విషయమంతా తెలుసుకున్నాడు. ఇంక వాళ్ళకి తినడానికి ఏమీ మిగలలేదని గ్రహించి చేతులు మొహం కడుక్కొని విశ్రాంతిగా కూర్చున్నాడు. తాంబూలం నములుతూ ఇలా ఆలోచించసాగాడు.

"వీరి జీవనం ధన్యమైంది. ఇంట్లో ఏమీలేదు. ఓ చిరిగిపోయిన గుడ్డతప్ప. ఇలాంటి స్థితిలో కూడా వీరికి అతిథిసేవ మీద ఎంత నమ్మకం!. ఎంత శ్రద్ధ! ఎంత ఇష్టం! చేసిన భోజనపదార్థాలు అన్నీ నాకు పెట్టేసి వీరిద్దరూ ఆకలితో ఉన్నారు. అయినప్పటికీ వీరి ముఖాలలో అసంతృప్తి భావం కొంచెంకూడా కనపట్టంలేదు. నిజంగా ఈ బ్రాహ్మణుని భార్య తన నెత్తిమీద ఉన్న జుట్టుని కూడా ఇచ్చేసిందే. అతిథి సేవకోసం జుట్టు కత్తిరించుకున్నందుకామె ఏమాత్రం విచారించడంలేదు. ఈవిడతో సమానురాలైన స్త్రీ ఈ ప్రపంచంలోనే లేదు".

భక్తుడు చూపిన ఆ ప్రేమలో మునిగి ఆలోచిస్తూండి పోయాడు భగవంతుడు. కొంచెం సేపయినతర్వాత, దామోదరుని దగ్గరికి పిలిచి, "నాయనా! నువ్వు చేసిన సేవకి నేనెంతో సంతోషించాను. చాలా రాత్రయింది ముసలివాణ్ణి ఇంత రాత్రిలో ఎక్కడికి పోగలను? కాబట్టి ఈ రాత్రికూడా మీ ఇంటనే గడిపి తెల్లవారగానే వెళతాను. నా భోజనం కోసం ఎక్కువ కష్టపడక్కర్లేదు. ఓ చిన్న గిన్నెడు బియ్యంతో వండిన అన్నం నాకు సరిపోతుంది" అన్నాడు అతిథి.

"అలాగేనండీ!" అని అది ఆజ్ఞగా భావించి భార్యదగ్గరకొచ్చి "చూడు! ఈ వృద్ధుడీరాత్రికిక ఇంటికెళ్ళడు, ఈ రాత్రి ఇక్కడే ఉండి తెల్లవారుఝామున వెళ్ళిపోతాట్ట మళ్ళీ కొద్దిపాటి బియ్యంతో భోజనం పెట్టమంటున్నాడు. ఏం చెద్దాం?" అన్నాడు

పతివ్రత అయిన అతని భార్య మళ్ళీ అలాగే చేయండి ఇంకా తలమీద జుట్టు ఉందికదా! దాన్ని పూర్తిగా కత్తిరించి డబ్బుపట్టుకురండి"

అంది. బ్రాహ్మణుడు, తలమీద మిగిలిన జుట్టునంతనీ కత్తిరించి, తీసుకువెళ్ళి, అమ్మి భోజనసామాగ్రిని తీసుకువచ్చాడు. వాటితో ఆమె చక్కగా రుచికరంగా వంట తయారుచేసి అతిథికి వడ్డించింది. ఇల్లాలంటే ఆమె. త్యాగమంటే ఆమెది. అతిథి సేవకోసం తలమీద జుట్టు ఇచ్చి ఓ గుడ్డ పీలిక తలమీద చుట్టుకుంది. దామోదరుడెంతో ఆనందించాడు. అతిథి సేవలో తన జీవితం ధన్యమైందని తలపోశాడు.

వంటపూర్తి అయ్యాక వృద్ధుడు భోజనానికి కూర్చున్నాడు. అతనికి తృప్తి కలిగేలా వడ్డించిందామె. ఆ విధంగా పతివ్రత కొసరికొసరి వడ్డిస్తుండగా బ్రాహ్మణుడంతా తిన్నాడు. పిడికెడు మెతుకులు కూడా వారికి మిగలలేదు. అతిథి చేతులు, మొహం కడుక్కున్నాడు. ఇంతలో దామోదరుడు గడ్డిపరకలు పరచి అతిథి పడుకోవడానికి పక్క ఏర్పాటు చేశాడు. సాధువు దానిమీద పడుకున్నాడు.

ఆ మహానుభావుడు, ఆదిశేషునిపై పవళించాడు, ఇంకా గరుడా వాహనంమీద, మునుల హృదయాలలోనూ, శంకరుని అంతరంగంలోనూ, శయనించిన త్రిజగత్పతి ఇప్పుడు ఈ గుడిసెలో భక్తుని పరిచర్యలు స్వీకరించడానికి సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు గడ్డిశయ్యపై పరున్నాడు. పరమాత్మ ప్రేమకు మాత్రమే ఆధీనుడు.

పడుకున్న అతిథికాళ్ళు పిసుకుతున్నాడు దామోదరుడు. భార్య తన చీర చెరుగుతో విసరసాగింది. శ్రీహరికి ఆ భక్తులు చేసే సపర్యలు, సేవలు వైకుంఠంలో కంటే ఎన్నో రెట్లు మనసుకి నచ్చాయి.

వైకుంఠసుఖమే తక్కువగా అనిపిస్తోంది. నారాయణుడు వారి సపర్యలతో సుఖనిద్రపోసాగాడు. అతిథి నిద్రపోయాడని గమనించి దామోదరుని భార్య అతనితో, "ఈ వృద్ధసాధువు చాలా ముదుసలి ఇంత ముసలివాడు ప్రొద్దున్నే ఎలా లేవగలుగుతాడు రేపుదయం మీరు పెందలాడే ముష్టికి బయలుదేరి వెళ్ళండి. ఏ పాటి దొరికినా ఆ వృద్ధునికి సరిపోతుంది. మనం అంటరా! ఈ రోజులానే రేపుకూడా పస్తు ఉందాం",



అంది.

భార్య చెప్పిన విషయం సబబేననిపించింది దామోదరుడికి. "సరె అలాగే" అన్నాడతను. జాగ్రత్, స్వప్న, సుషుప్తావస్థలకు అతీతుడైన భగవంతుడు కనులు మూసుకొనే అన్నీ వింటున్నాడు. దామోదర దంపతుల సంభాషణ. వింటుంటే భగవంతుడికి పరమాద్భుతంగా అనిపించింది. వారి అతిథి, సత్కారభావాన్ని ఎన్నో విధాలుగా మెచ్చుకున్నాడు. వారి అతిథి వాత్సల్యానికి భగవంతునికే కనులనుండి అశ్రువులు రాలసాగాయి.

సేవచేసి అలిసిపోయి దామోదర దంపతులు బ్రాహ్మణుని పాదాలవద్ద పడుకొని ఉన్నారు. అలా వారినిచూసి భగవంతుడు సహించలేకపోయాడు. ఆయనలేచి దామోదరుడి భార్య తలమీద చెయ్యివేసి నిమురుతూ, "అమ్మా! ఓ పతివ్రతా! ఈ అమ్మా అన్నపదంలో ఎంత తీపివుంది. ఇంకా మరికొన్నిసార్లిలాగే పిలవాలనుంది. పాపం నీకత్తిరించిన జుట్టు మరల తలనిండుగా వచ్చుగాక! నీ ఆపాదశిరః పర్యంత శరీరం వజ్రమాణిక్య రత్నాలతో ప్రకాశించుగాక! నీ శరీరమంతా సుందరమైన కాంతులతో మనోహరంగా కన్పించుగాక!" అని భగవంతుడు ఏమి అంటున్నాడో అన్నీ అలాగే అవుతున్నాయి. భగవంతుడు నిలబడ్డాడు. ఆ గుడిసె నాలుగు పక్కల చూశాడు. దయాపూరితమైన కంఠంతో, "ఓ కుటీ! నీవు రాజమహలుగా మారు" అన్నాడు. అంతే భగవంతుడి మాటప్రకారం ఆ కుటీరం రాజమహలుగా మారిపోయింది. ఇంకా ఆయన ఇలా అంటున్నాడు, "ఓ గృహద్వారమా! నువ్వు మణిరత్నాలతో, నిర్మింపబడిన దానిలా మారిపో అనగానే ఆ ద్వారం తళతళ లాడుతున్న మణిరత్నద్వారం అయిపోయింది. తర్వాత భగవంతుడు దామోదరదంపతుల శిరస్సులమీద తన చేయుంచి అమృతవర్షంలాంటి వాక్కులతో, "మీరిద్దరూ ఈ లోకంలో జీవించాలని, ఉన్నంతకాలం సకల సుఖాలతో భోగాలనుభవించండి. తదనంతరం వైకుంఠానికి రాగలరు. మీ జీవనమరణాలకి తోడుగా మిమ్మాశ్రయించి ఉంటాను. మీరు ధన్యులు అని భగవంతుడు వారినాశీర్వదించి అంతర్ధానమయ్యాడు.

తెల్లవారింది. దామోదరుని భార్య లేచిచూసేసరికి ఆశ్చర్యంతో ఆమె ఇలా అనుకోసాగింది, "ఏమిటి? నేనిప్పుడు ఎక్కడున్నాను? నా చిరిగిపోయిన చీర పాతపీలిక ఏది? ఇంత ఖరీదైన వస్త్రాలు ఎక్కణ్ణించి వచ్చాయి? నా శరీరంనిండా వున్న ఈ ఆభరణాలెక్కడివి?" అనుకుంటూ తలమీద చెయ్యిపెట్టుకొంది. ఆశ్చర్యంమీద ఆశ్చర్యం. ఆమె తలమీద పోయిన జుట్టంతా వచ్చింది. రాత్రిపోయిన జుట్టు తెల్లారేసరికి ఎలా పెరిగిపోయింది? నా శరీరమంతా మణిమాణిక్య రత్నకుండలాలతో ఎలా నిండిపోయింది, ఇదంతా నే కలగంటున్నానా? మరి ఆ వృద్ధసాధువేమయ్యాడు! భయాశ్చర్యాలకులోనై ఆమె నలుమూలలా చూడసాగింది. ఆమె పొందుతున్న ఆశ్చర్యానికి అవధుల్లేవు.

ఏది ఆ చివికిపోయిన గుడిసె? ఆ గడ్డిశయ్య ఎక్కడ? ఆ పాడయిపోయిన చిల్లుచెంబు? ఆ నా పాత గుడ్డ ఏమైనాయి? ఇల్లు కనపడదేమిటి? అర్థంగాని ఆశ్చర్యంలో ఆమె ఇల్లు చూస్తూ "ఏమి పెద్దమహలు, భారీ గదులు, మణులు, రత్నాలు పొదగబడి ఉన్నాయి. ధనధాన్యాదులతో నిండిన గాదెలు, ఇంత ఖరీదైన ఆభరణాలు ఈ చీనీచీనాంబరాలు ఏమిటిదంతా?"

కపురుగొట్టుకుపోయి, ఎండిపోయి, బీటలువారి, రంగులేని వాసనగా ఉండే నా నాధుడు, ఇతనేనా! మధురాతిమధురమై మనోహరమైన శరీరకాంతితో విరాజిల్లుతూ, రూపంలో అపరమన్మథుడిలా ఉన్న ఈ వ్యక్తి నిజంగా నా భర్తేనా! ఈ చంద్రశాలలో ఇంకా నిద్రలో ఉన్నాడు. సంభ్రమాశ్చర్య చకితుల్నిచేసే అనన్య సామాన్యమైన అనితరసాధ్యమైన, మణిమయ సువర్ణ శిఖరాలతో ప్రకాశిస్తూ, రమ్యమైన ఈ సుందర భవనంలో తన భర్త ఆమె ఆశ్చర్యం నుండి తేరుకొనకుండానే ఆయన్ని చేరి "ప్రియవల్లభా! లేవండి, అన్నివైపులా చెప్పలేని అద్భుతాలు" అంటూండగా భర్త కళ్ళు తెరిచాడు. లేచిన దామోదరుని చేతితో గబగబపట్టుకొని "ఇలా చూడండి. ఇదిగో ఈ స్వర్ణాభరణాలు చూశారా! ఈ మణిఖచితస్వర్ణమయ కుడ్యరమ్యచంద్ర శాలలు, చూడండి ఈ భారీగదులు, నిండిన గాదెలు, అంటునే దామోదరుణ్ణి బైటకి తీసికెళ్ళి ఇలా అంది,



"నాథా! ఇవన్నీ ఇలా ఉంచండి ముందుగా ఆ వృద్ధుడైన అతిథిని వెదకండి. ఆ వృద్ధుడు ఎటువెళ్ళాడో, ఆయన మామూలు మనిషి కాదు, ఆయన ఎక్కడికి వెళ్ళి ఉంటాడో చూడండి" అంటుంటే దామోదరుడు అన్నిమూలలా కలయచూశాడు. నిన్న కనబడ్డవస్తువులు గాని, ఇల్లుగాని కనపట్టంలేదు. అన్నీ ఎంతో మారిపోయాయి.

మహాభయంకరమైన దరిద్రదుఃఖమనే చీకటిని ఛేదించుకొని ఐశ్వర్య సూర్యోదయం అయింది. ఆ వెలుగులు అంతటినీ ప్రకాశింపచేస్తున్నాయి. చెంబుపట్టుకొని, చీలికలైన బట్టలు కట్టుకొని, వీధులలో ఇల్లిల్లు తిరుగుతూ "సీతారామాభ్యాం నమః" అనే వ్యక్తి ఈనాడు ఒక్కసారిగా అలవికాని ఐశ్వర్యానికి అధిపతి అయ్యాడు. దామోదరుడి కాళ్ళూచేతులు వణికి పోతున్నాయి. ఒక్కడుగుకూడా ముందుకు వేయలేకపోతున్నాడు. "కృష్ణం వందే జగద్గురుమ్" అంటూ తెలియని అవస్థలో ఉండిపోయాడు. శరీరం జలదరించిపోతోంది. కళ్ళవెంట కన్నీరు ధారలు కడుతున్నాయి. గద్గదికమైన కంఠంతో దామోదరుడు, "ప్రియా! ఆ వృద్ధుడు అతిథికాదు, మనుష్యుడూకాదు, కానరాని ఆయన్ని వెదకడానికి బైటికివెళ్ళినా ఆయనకి దర్శనం ఇవ్వాలని ఉంటే ఆయనే కనబడతాడు. ఇష్టంలేకపోతే ఈ ప్రపంచమంతా వెదికినా కనపడడు. ఆయన సనాతనుడు, పరమపురుషుడు. వెదకడానికి ఎక్కడికనివెళ్ళను? ఆయన ఊరేదని? ఇల్లెక్కడని? ఈ విశ్వమంతా ఆయనేకదా! దర్శనమివ్వాలని ఉంటే ఇక్కడే ఇవ్వగలడు. ఇవ్వాలని లేదు! ఎక్కడా లభించదు. ఇప్పటికైనా ఆయన్ని పోల్చుకున్నావా? ఎవరి పాదస్పర్శ రాయిని రమణిని చేసిందో! ఎవని శరీరపు స్పర్శకి కుబ్జ అందమైన యువతిగా మారిందో! అటువంటి లోకోత్తర విశేషాలు కనబరచగల శక్తి ఎవరికుంది? ఇంతెందుకు నీ శరీరంవైపు చూసుకో! ఈ చరాచర ప్రకృతినంతనూ సృజించిన మహాస్రష్ట అయన ఈ లోకాన్ని సృజించి పాలించి సంహరించగల శక్తిశాలి ఆయనే వృద్ధుడు, అతిథిగా మనకు గోచరించాడు. ఈ ఇల్లు పావనం చెయ్యడానికొచ్చాడు. ఓ దేవీ! ఆయన్ని శరణుకోరుదాము. వినయపూర్వకంగా దీనులమై ఆయన్ని క్షమించమని వేడుదాం. మనం ఆయన్ని సామాన్యుడిగా అనుకున్నాము ఆయన్ని సేవించుకుంటుంటే సమయమెలాగడిచిపోయిందో కదా!". అంటూ

ఇరువురు చేతులు జోడించి భగవంతుని ఈ విధముగా స్తోత్రం చేయసాగారు.

"ఓ లోకరక్షక! మా తప్పులు క్షమించుస్వామీ! నిన్ను పరమాత్మగా తెలుసుకోలేకపోయాము నీవు అంతులేని దయా సముద్రుడవు. ఓ బ్రహ్మాండపతీ! ఈ లోకానికి నీవే ఏకైక పతివి. ప్రతి ప్రాణిలోనూ నీవున్నావు. ఉంటున్నావు. నీ దగ్గర ఏది దాచినా దాగదు. ఇది మా ప్రార్థన తెలివి తక్కువగ నిన్ను మేము ఏమన్నా, ఏ అపరాధం చేసినా మమ్మల్ని క్షమించు".

ఇలా దామోదర దంపతులు చాలాసేపు భగవంతుని స్తుతిస్తూనే ఉండిపోయారు. కన్నీరుకార్చారు. భూమిమీద పడి పొర్లాడారు (భక్తిలో పరాకాష్ఠస్థితికి వెళ్ళిన వారట్లే చేయుదురు) చివరకు స్పృహలోకి వచ్చారు. తర్వాత భగవంతుడికి గొప్ప ఉత్సవం చేశారు. వారి జీవితమంతా భగవంతుడిసేవ, అదేభావన, భగవద్భక్తులసేవ, గో, బ్రాహ్మణసేవ చేస్తూ కాలం వెళ్ళబుచ్చుతున్నారు. కొంతకాలానికి దామోదర దంపతులు శరీర త్యాగంచేశారు. పిదప దివ్యదేహాన్ని ధరించి వైకుంఠం చేరి అక్కడ వైకుంఠుని సేవించుతున్నారు.

----oOo----





# 3. గోరక్షకుడు భక్తగోపాలుడు

ఉత్తరప్రాంతంలో 'కమలావతి' అని పేరుగల నగరంలో ఒక గొల్లవాడు నివసిస్తుండేవాడు. అతనిపేరు గోపాలుడు. అతని వృత్తి కూడా పేరుకుతగినదే. గోసంరక్షణ చేసేవాడు. గోపాలునికి చదవటం, వ్రాయటం రాదు. అతనెప్పుడూ ఓ కథ వినలేదు, పోనీ ఏవార్తను వినలేదు. ఆచారంగాని, ఆలోచనగాని అతనికి లేదు. తెలీదు. ఆచారవ్యవహారాలుగా చెప్పబడే వాటిలో మహత్వమూ లేదు. విశేషములేదు. నిజమైన ఆచారమంటే భగవంతునికి అనుకూలంగా వర్తించటమే. నిజమైన విచారమంటే సర్వదా భగవంతుని నామోచ్చారణ చెయ్యడమే. ఇలా చెయ్యనివాడు భగవంతుని ప్రేమకు పాత్రుడుకాడు. అయితే గోపాలుడు నిజమైన ఆచారవిచారాలు కలవాడు. అతడు రోజంతా అడవిలో ఆవులతో పాటు తిరుగుతుంటాడు. ఇల్లువాకిలి భార్య పిల్లలు కలవాడు. వారిని గురించి పెద్దగా పట్టించుకోడు. ఇంటికి వెళ్ళడం కూడా తక్కువే, భార్య అతనికి అన్నపానాదులు పంపిస్తుంటుంది. గోపాలుడు ఆహారాన్నితిని, పశువులను మేపుకుంటు తిరిగేవాడు. అతనిలోని సుగుణమేమిటంటే శ్రీహరియొక్క పావన నామమంటే అతనికి ప్రీతి ఎక్కువ, ఆ నామాన్ని ఉచ్చరిస్తు, అలా ఉచ్చరించటం శుభప్రదంగా భావించేవాడు. ప్రొద్దున, సాయంత్రం శ్రీహరి యొక్క పరమపవిత్ర నామోచ్చారణ చేస్తూ జీవిస్తున్నాడు. అలా చేసేవాడు నిజంగా మహాత్ముడే.

భక్తతులసీదాసు ఇలా అంటాడు, "రామసేవకుడు సర్వదా భయరహితుడు, నీచజాతివాడయినా నిరంతరం రామనామం జపించువాడు, నిజమైన మహాత్ముడు. గొప్ప కులంలో వాడయిన హరినామాన్ని కీర్తించనివాని జీవితం వ్యర్థం" అంటాడు.

రోజులు దొర్లిపోతున్నాయి. గోపాలునికి యాభై సంవత్సరాలు వెళ్ళాయి. తోటివారు అతణ్ణి ఎగతాళి చేసేవారు. రామ రామ అంటుంటే వైకుంఠంనుండి విమానం రాదనేవారు. ఆ మాటలు అతనికి చాలా అసహ్యం అనిపించేది. అయినా వారికి అతడు సమాధానం ఇచ్చేవాడు

కాదు. ఒకరోజున ఓ సాధువు ఆ దారిన వెడుతు గోపాలుని కొందరు వేళాకోళం చెయ్యడంచూసి వారితో సాధువు ఇలా అన్నాడు, "అయ్యా! మీరు పెద్ద పొరపాటుచేస్తున్నారు. నిజంగా నమ్మకం కలిగి భగవంతుని పవిత్రనామం స్మరించేవాడు దుఃఖపూరితమైన ఈ సంసారసాగరాన్ని తరించుతాడు. బ్రహ్మలోకాన్ని మించిన సుఖస్వరూపమైన పరమాత్మయొక్క పరంధామం ప్రాప్తిస్తుంది. ఈ ముసలి గొల్లవాడు అంతగా ఏమీ తెలియని వాడైనా భగవంతుని నామోచ్ఛారణం చేస్తున్నాడు. అటువంటి నామోచ్ఛారణం ఎంతో గొప్పది. భగవంతుని నామోచ్ఛారణం కారణంగా ఒక ఉత్తమ గురువు లభించుతాడు. తెలుసుకోకుండా నిప్పుని తాకినా అది చురుక్కుమనక మానదు. అదే రీతిగా భగవంతుడి నామోచ్ఛారణం చేస్తే సకలపాపాలూ పటాపంచలైపోతాయి. ఎవడైనా మూర్ఖుడు వేళాకోళంగానైనా అలా పావన నామోచ్ఛారణం చేస్తే తప్పక అట్టివానికి మంచిగురువు లభించి ఉత్తమ మార్గంలోకి తెచ్చేవాడు లభించుతాడు. చివరికి అట్టి వాడుకూడా ఉద్ధరింపబడతాడు".

సాధువు చెప్పిన మాటలు విన్న ఆ వేళాకోళం చేసేవారు సిగ్గుపడి పోయారు. గోపాలచర్వాహకుడు యీ మంచిమాటలు విన్నాడు. సాధువు చెప్పిన మాటలు ఆ స్వరూపంయొక్క మహిమ, మనసులో ఓ రకమైన విలక్షణ ప్రభావాన్ని కలిగించింది. గోపాలుడు సాధువు దగ్గరికెళ్ళి అతని పాదాలు స్పృశించి" గురుదీక్షను ఇవ్వండి" అని ప్రార్థించాడు. ఇతడు సాధువు. ఇతణ్ణి గురువుగా పొందుదాం అన్న అభిప్రాయాలు కలగడం మూలంగా ఉచ్ఛశ్రేణి మానవుడయ్యాడు. అంతేకాదు హృదయంలో భగవత్ప్రేమ గురించి ఆలోచన చేస్తున్నాడు.

గొల్లవాడి ప్రార్థన ఆలకించిన సాధువు స్వభావసిద్ధమైన దయతో, "ఏమయ్యా! చూడు నేనే నీకు గురువు కావలసిన అవసరం లేదు. కాని నీకు గురువు తప్పక ఉండాలి. నడిపేవారు లేకుండా నావ నడవదు. అలాగే భయంకర తరంగాలతో కూడిన సంసారమనే సముద్రాన్ని ఈది ఇంకో ఒడ్డు అనే స్వర్గధామంచేరి నీవు నిర్భయంగా ఉంటావు. నువ్వు కూడా అప్పుడు ఓ ఉత్తముడివి కాగలవు. పరమకారుణ్యమూర్తి అయిన



భగవంతుని దయవల్ల ఆయన దర్శనం పొంది కృతకృత్యుడవుతావు. గోపాలకా! ఇంతవరకూ ఎందరో భక్తులు భక్తి కలిగి ఉద్ధరింపబడ్డారు. ఈ దారిలో ఎందరో సాధుపుంగవులు వస్తూ, వెడుతుంటారు. అటువంటి మాహాత్ముల దర్శనభాగ్యంవలన పాపుల పాపమంతా తుడుచుకుపోతుంది. మనస్సప్పుడు సాత్త్విక భావాలతో శాంతిగా ఉంటుంది. ఆ మాటలు వింటేనే ఆనందము ఉప్పొంగుతుంది. అందుచేత మహాత్ముణ్ణి గురువుగా స్వీకరించు" అన్నాడు. సాధువు చెప్పిన మాటలు విన్నంతనే గోపాలునికి ప్రభువు దర్శనం అవుతుందని అనిపించగానే చాలా ఆనందం కలిగింది. అతని హృదయం ఉత్సాహంతో నిండిపోయింది. ఈ మాటలు చెప్పి సాధువు తన దారినతాను వెళ్ళిపోయాడు.

గోపాలుడు ఒక గురువుని ఆశ్రయించాలని నిశ్చయించుకున్నాడు. తన కోరికని స్నేహితులకు చెప్పారు. ఉత్తమ గురువు ఎక్కడ లభిస్తాడు? ఎలా సంపాదించడం? ఎందుకు దొరకడు? సాధువు అందుకు మార్గంకూడా చెప్పాడు కదా! ఈ మార్గంగా ఒకరు కాకపోతే ఇంకొకరు ఎవరోఒకరు దొరక్కపోరు. దొరుకుతారు అటువంటి గురువు దొరకడం సంభవించితే వారికి నేను అప్పుడే తీసిన ఆవుపాలనిస్తాను. వారు సుముఖులౌతారు. నేను వారిని అడుగుతాను. స్వామీ మీనుండి విశేష జ్ఞానాన్నికాక నాకు తెలిసేపాటి కొద్ది జ్ఞానాన్ని ఉపదేశించండి. నాకు చిన్న చిన్న విషయాలు చెప్పండి మీ దయవల్ల వాటిని పాటించుతాను. నాకితర త్రాజంజాటమేమిలేదు అంటాను. నన్నప్పుడు గురువు శిష్యుడిగా స్వీకరిస్తారు, అన్నాడు గోపాలుడు. అతని మిత్రులందరూ ఆ మాటలువిని పక్కున నవ్వారు.

గోపాలచర్వాహుడు ఇప్పుడు మంచిగురువు ఎవరు? ఆయన్నెలా పొందటం అని గురువుని అన్వేషించడంలో ఉన్నాడు. అతనా అన్వేషణలో ఉండగానే రోజులు దొర్లిపోతున్నాయి. గురువును పొందాలన్న కోరిక గోపాలునిలో హెచ్చసాగింది. ఇంతవరకూ అతడిపని గోవులని కాచటంగానే ఉంది. ఇప్పుడింకో కొత్తపని. ఇప్పుడు గోపాలుడు పాతపని అలా ఉంచి, రాజమార్గంవైపు వెళ్ళి అక్కడ ఓ చోటకూర్చుండి, వచ్చేపోయేవారి

ముఖకవళికలను కనిపెడుతూ గురులక్షణాలుగల వ్యక్తి కోసం ఎదురుచూస్తున్నాడు. దారినపోయే వారిని చూస్తు మీరు సాధువులు రావటం ఏమైనా చూశారా? అంటూ ప్రశ్నిస్తున్నాడు. ఒకోసారి ధైర్యం చాలక దుఃఖపడుతుండేవాడు. నిజమైన కోరిక సఫలం కావడానికి ఆలస్యం ఉండదు. మంచి గురువుకోసం ఎదురుతెన్నులు చూస్తే భక్తుణ్ణి వెదుక్కుంటూ భగవంతుడే దిగివస్తాడు. అటువంటి ఉత్తమ శిష్యుడికి బోధించడానికి ప్రేమగల భగవంతుడు ఏదోరూపంలో తన భక్తుణ్ణి చేరతాడు. అటువంటి శుభదినం రావాలి.

ఎంతో ఆదుర్దాతో ఉన్నగోపాలునకు గురువు దొరకడంలో ఆలస్యం కాలేదు. ఒకనాడు భగవంతుని దయవల్ల గురువుకోసం గోపాలుడు ఆలోచిస్తుండగా భగవంతుని ప్రేరణవలన ఒక పరమ భాగవతోత్తముడైన సాధువు ఆ వైపుగా వెడుతున్నాడు. ఆ మహానుభావుణ్ణి దూరంనుంచి చూస్తునే గోపాలుని హృదయం సంతోషపడింది. ఆ సాధువుయొక్క విలక్షణమైన ముఖలక్షణాలను గమనిస్తున్న గోపాలుడు బిగ్గరగా కేక వేశాడు.

"అయ్యా! నన్ను ఈ సంసార సాగరంనుంచి తరింపచేయగల గురుదేవులు అదుగో, వస్తున్నారు. నా గురువుకు శుద్ధమైనపాలు ఇస్తాను" అనుకుంటూ గోపాలుడు పరుగున వెళ్ళి ఆవుపాలు తీయడానికి కూర్చున్నాడు.

శిష్టుడు, సౌమ్యుడూ, తేజోమయుడు అయిన ఆ మూర్తి అతని సమీపానికి వచ్చాడు. పాలుతీయడంమాని గోపాలుడాయనని సమీపించుతూ, "ఓ మహానుభావా! ఆగండి! కొంచెం పాలుతాగివెళ్ళండి" అన్నాడు. గోపాలుని చేతిలో పాలచెంబు, కాపలాకాచేటప్పుడు ఉపయోగించే చేతికర్ర ఉన్నాయి.

ఆ సాధువు గోపాలుని పిలుపువిని ఆగాడు. ఆ పిలుపులో ఆదుర్దాకనిపిస్తోంది. గోపాలుడు సాధువును సమీపించి ఆయన పాదాలమీద వాలిపోయాడు. చాలా సరళమైన రీతిలో "అయ్యా! ఈ సంసారసముద్రాన్ని దాటించండి. ఇవిగో ఈ పాలుత్రాగండి. నాకు చిన్న ఉపదేశం ఇచ్చి నన్ను కృతార్థుణ్ణి చేయండి". పాలచెంబు, కర్రా క్రిందపెట్టి తన చేతులతో సాధువు పాదాలుగట్టిగా పట్టుకొని, "అయ్యా! నాకు ఉపదేశమిచ్చి నన్నుద్ధరించండి మీరు సరేనంటేనే కాని మీ పాదాలు విడువను" అన్నాడు.



సాధువు ఇదంతా చూసి నోటిమాట లేకుండా నిలుచుండిపోయాడు. గోపాలుని భక్తిభావాన్ని చూస్తున్న ఆయన మనస్సు కరిగింది. గోపాలుడు తన కన్నీటితో ఆయన పాదాలు తడుపుతున్నాడు. సాధువు హృదయం ద్రవించి, గోపాలునిపై విశ్వాసం కుదిరింది. ఆయన గోపాలునితో, "ఓయీ! లేచికూర్చోనుము. నాపాదాలు విడువుము. నీ గృహానికి నడు. అక్కడ పవిత్రమైన ప్రదేశంలో, ఏకాంతమందు నీకు దీక్ష ఇస్తాను. నీ శరీరం చూస్తుంటే చాలా రోజులుగా స్నానం చేసినట్లు కనబడడంలేదు. మొదట నువ్వు స్నానం చెయ్యి" అన్నాడు.

గోపాలుడు ఆయనతో, "నేను వనంలో ఉండి కేవలం ఆవులను మేపుకుంటాను. నాకు గృహసంబంధంగా ఏ చింతాలేదు. నేను ఇంటికి కూడా ఎక్కువగా వెళ్ళను. స్నానాదులు చేయాలన్న సంగతి నాకు తెలియదు. ఇక్కడ, ఈ క్షణాన మీరు నాకు ఉపదేశం ఇవ్వండి. ఇంటిదాకా వెళ్ళేంత ఆలస్యాన్ని నేను సహించలేను" అన్నాడు.

ప్రేమ కలిగివుంటే ఏ బంధనాలు అడ్డురావు. సత్యమైన కోరిక సఫలం చేయడానికి ఏ ప్రేమలు, బంధాలు అడ్డుగా ఉండలేవు. సాధువు అతని ప్రీతి పూర్వకమైన ఆత్రుతని అర్థంచేసుకొని ద్రవించిపోయాడు. అతనితో ఇలా అన్నాడు.

"తమ్ముడూ! సరే నేను నీకు ఇక్కడే ఉపదేశం ఇస్తాను. కాని దీక్ష తీసుకునేముందు నువ్వు ఒక ప్రతిజ్ఞ చేయవలసి ఉంది. చిన్నవ్రతధారణ ఒకటి నువ్వు చేయాలి. మరి నేను చెప్పినట్లు చేస్తావా?".

గోపాలుడాయనతో, "ఓ సజ్జన శ్రేష్ఠుడా! నేను తప్పక చేస్తాను. కాని నేను గొల్లవాణ్ణి స్వామీ, నేను చాలా మాటలు పలుకలేను. అందుచేత చిన్న ఉపదేశం, తేలికైనదేదైనా ఎక్కువే. కాబట్టి అతి తేలికైన ఉపదేశం చేయండి. నేను మాట ఇస్తే దాన్ని నిలువుకోవడానికి నా ప్రాణాలనైనా అర్పించగలను" అన్నాడు.

గోపాలుని అమాయకపు మాటలకి సాధువు సంతోషించాడు. గోవింద నామాన్ని స్మరించి అక్కడ కూర్చున్నాడు. మానసికంగా ఆసనశుద్ధి మొదలయినవి జరిపి అనంతరం కమండలంలోని నీటిని తీసుకుని గోపాలుని శిరస్సుమీద చల్లాడు. మంత్రాన్ని గోపాలునికి ఉపదేశించాడు. తర్వాత అతనితో "వత్సా! భగవంతుడు ప్రతిఘటమందు క్రీడిస్తుంటాడు. నువ్వుతినే ఆహారం ముందు గోవిందునికి నివేదన చేశాక భుజించు. చాలు ఇది బాగా సాధనచెయ్యి. భగవంతునికి నీమీద తప్పక దయ కలుగుతుంది" అన్నాడు.

"గోవింద" అన్నమాటవిని గోపాలుడు సంతుష్టాత్ముడై పోయాడు. ఆ తర్వాత సాష్టాంగదండప్రణామం చేసి ఇలా అడిగాడు. "స్వామీ! గోవిందుడనే ఆ దేవుడు ఎలా ఉంటాడు? ఆయన దర్శనం ఎలా అవుతుంది? ఈ విషయాలు నాకు తెలిసేలా వివరంగా చెప్పండి" అన్నాడు.

సాధువతనితో, "నాయనా! ఆ మహా ప్రభువు విశ్వమందంతటా నివసిస్తున్నాడు. అయితే నువ్వు సత్యమైన మనస్సుతో చూస్తేనే ఎక్కడ కావాలంటే అక్కడ ఆయన దర్శనం లభిస్తుంది. ఆ శ్రీకృష్ణ పరమాత్మ యొక్క దర్శనం ఎంతో ఆనందదాయకమైనది. ఆయన శరీరఛాయ నీలవర్ణశోభితంగా ఉంటుంది. ఆ దేవుని నేత్రాలు వికసించిన తామర పద్మపత్రాలలా ఎంతో నయనానందకరంగా ఉంటాయి. శరత్కాల పూర్ణచంద్రుడి శోభలు, ఆయన ముఖమండలమందు కనబడుతూంటాయి. ఒక్కసారి ఆయన దర్శనమైందనుకో దుఃఖాలన్నీ పటాపంచలైపోతాయి. ఆ శ్రీకృష్ణదేవుని ముఖం అంత ఆకర్షణీయంగా ఉంటుంది. పెదవులు దొండపండు రంగులో అందంగా ఉంటాయి, తియ్యని స్వరాలనిచ్చే పిల్లనగ్రోవి వాయిద్యం పెదవులపై చేత్తోపట్టి, మొలలో అందమైన మొలత్రాడు, పాదాలకు మెల్లగా రవళించే మువ్వల అందెలు, హృదయాహ్లాదకరమైన అద్భుతరూపం, పద్మాల్లవంటి పాదాలు అవి రంగుపారాయణి కలిగినవి. అటువంటి ఆ అందమైన రూపాన్ని స్మరిస్తూ, మంత్రాన్ని జపించుతూ ధ్యానించు. హృదయపూర్వకంగా పిలు. ఆయనలేని చోటంటూ ఉండదు. ఆయనకి ప్రసాదంగా పండో, ఆహారమో నివేదించు. ఆ ప్రసాదాన్ని తరువాత నువ్వు భుజించాలి. ఇలా చేయడం మాత్రం మరిచిపోకూడదు. ఈశ్వరుని దయవలన నీకు శుభం కలుగుతుంది" అని చెప్పి సాధువు తియ్యని పాలు తాగి అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. గోపాలుడు ఆ సాధువుకి నమస్కరించి తన గోశాలకి చేరుకున్నాడు.



ఈ విషయం, భార్యాపిల్లలకు చెప్పలేదు. ఇంతలో అతని భార్య అతనికోసం భోజనం తెచ్చి అతనికిచ్చి వెళ్ళింది. అతనప్పుడు ఆలోచనలో ఉన్నాడు. అతని మనసు సాధువు వర్ణించి చెప్పిన చిత్రాన్ని హృదయ ఫలకంమీద వ్రాస్తున్నాడు. అదే ధ్యానంతో గురువుచెప్పిన మాటలను గుర్తు చేసుకుంటున్నాడు. భగవంతుడు ప్రతిచోటా ఉన్నాడన్న సంగతి జ్ఞాపకం చేసుకున్నాడు. భగవంతుడు అంతటా అన్నిచోట్లా ఉంటే ఎందుకు కన్పించడు? గురుదేవుడు చెప్పిన రూపంలో ధ్యానించి చూస్తాను. ఇలా గోపాలుడు అనుకుంటూ, తన భార్య తెచ్చి పెట్టిన భోజన సామగ్రిని చూశాడు. గురువు చెప్పిన మాటలు గుర్తుకు రాగా ఆ భోజన పదార్థాలను ఏకాంతంలోకి తీసికెళ్ళాడు. దానిమీద జలంచల్లి తులసీదళం ఉంచి కన్నులు మూసుకొని ధ్యానిస్తూ, భోజనం నివేదించడానికి రెండు చేతులూ జోడించి, "ఓ గోవిందా! ఇవిగో రొట్టెలు. ఇక్కడ ఉంచాను. వీటిని స్వీకరించు. మా గురువుగారు చెప్పారు. భగవంతునికి మొదట నివేదించి ఆ ప్రసాదాన్ని స్వీకరించాలి" అని.

కాని భగవంతుడు వచ్చి ఆ ప్రసాదాన్ని తీసుకోలేదు. అందుకు గోపాలుడు చాలా బాధపడ్డాడు. ఆ రొట్టెలను అడవిలోపారేసి గోశాలకొచ్చి కూర్చున్నాడు. అతడు రాత్రి ఏమీ తినలేదు. రెండవరోజు మధ్యాహ్నం

అతని భార్య మామూలుగా భోజన పదార్థాలు అక్కడపెట్టి వెళ్ళిపోయింది. ఆ రోజు కూడా ఏకాంతంలో కూర్చుండి భగవంతుణ్ణి పిలిచాడు. గోవిందుడు రాలేదు. భోజనం చేయ్యనూలేదు. గోపాలుడికి చాలా ఆకలివేసింది. అప్పుడు గోపాలుడు మనసులో ఇలా అనుకున్నాడు.

"భగవంతుడికి రొట్టెలు నివేదించకుండా తినను. భగవంతుడు ప్రసాదం తినేదాకా నేను ఉపవాసం ఉంటాను" అని మనసులో గట్టిగా అనుకొని ఆహారం తినకుండా ఉండిపోయాడు.

ఇలా రోజులు గడిచిపోతున్నాయి. అదే ఈ నాటి వారైతే గురువన్నా, దైవమన్నా ఎక్కువ శ్రద్ధచూపటంలేదు సరికదా భక్తి భావాన్ని విడిచిపెడ్తున్నారు. కాని, ఆ రోజులు యీనాటి రోజుల్లాంటివి కావు. ఈ రోజులెలాంటి వంటే నేను అనే అహాన్ని ప్రధానంగా చూసుకునే రోజులు. ఆనాటి గ్రామీణుడైన గొల్లవాని హృదయంలో ఎలాంటి కుతర్కానికి తావులేదు. ఆకలిగొన్న వాణ్ణిచూసి చాలా బాధపడేవాడు. అతడు దీన్ని ఓ వ్రతంలా భావించి ఆ విషయంలో చాలా ధృఢనిశ్చయం కలిగి ఉన్నాడు. ఇలా అవిచ్ఛిన్నంగా పద్దెనిమిది రోజులు గడిచాయి. గోవిందుడు రాలేదు. గొల్లవాడు భుజించనూ లేదు.

గొల్లవాడు భోజనం చేయకుండానే ఉంటున్నాడు. పద్దెనిమిదిరోజులుగా భోజనం చెయ్యని కారణంగా నానాటికీ క్షీణించి పోతున్నాడు. కడుపులోపలికి పోయింది. కన్నులు గుంటలు పడిపోయాయి. మనిషి నిలబడితే వంగినట్లయిపోయాడు. ఇదంతా చూసి అతని భార్య ఇలా చిక్కిపోతున్నారేమిటి? ఇంత నీరసించిపోవడానికి కారణమేమిటని ప్రశ్నించింది. ఎంత అడిగినా అతడు జవాబివ్వలేదు. ఆమె మాత్రం యధాపూర్వకంగ ఆహారం ఇచ్చి వెళ్ళిపోతుంది. గోపాలుడా ఆహారాన్ని ఏకాంతంలో కూర్చొని భగవంతునికి నివేదించి ధ్యానించుతున్నాడు. ఏమైనా తన వ్రతం విషయంలోమటుకు చాలా ఖచ్చితంగా ఉంటున్నాడు. అతని ఆలోచన ఏమిటంటే ఈ ప్రపంచంలోకి వచ్చిన తర్వాత వెనకో, ముందో చావకతప్పదు. గురువు చెప్పినమాట తప్పడందేనికి? ఆయన చెప్పింది



నిజమే. ఇక్కడ చనిపోయినా అక్కడ గోలోకంలో భగవంతుడి దర్శనం తప్పక అవుతుంది. ఏది ఏమైనా గురువు చెప్పినదాన్ని మాత్రం విడవటం జరగదు. అని గట్టి నిశ్చయానికొచ్చాడు. గురువు మాటపై ఎంత శ్రద్ధ అతనికి".

గోపాలుడు ఉపవాసాలు చేయడం మొదలుపెట్టి అప్పటికి ఇరవై ఏడు రోజులవుతున్నాయి. ఒంట్లోగల శక్తంతా తగ్గిపోయింది. కళ్ళు తెల్లబారిపోయాయి. నేడో రేపో అతనీలోకం నుండి మరోలోకానికి ప్రయాణమయ్యేవాడిలా ఉన్నాడు. భార్య మాత్రం ఆహారం తీసుకొని వస్తూనే ఉంది. భర్త పరిస్థితి ఆమెకు చాలా విచారం కలిగిస్తోంది. అప్పుడిలా అంది, "మీకిప్పుడు ఏమైనది? ఎందుకిలా అయిపోతున్నారు? దీనికతడు జవాబేమీ ఇవ్వలేదు. "అయితే నేనీపూట ఇంటికే వెళ్ళను" అందామె దానికతడు సమ్మతించలేదు. భర్త ఆజ్ఞమీద ఆమె ఇంటికి తిరిగి వెళ్ళింది. ఎంతో అయిష్టంగా, కష్టంగా భార్యవెళ్ళటం చూసి, అతికష్టంమీద లేవలేక అతడు లేచి ఆహారాన్ని ఏకాంతంలోకి తీసుకువెళ్ళి ఎప్పటిలాగే భగవంతుని ధ్యానించి కూర్చొకుండా భగవానుని పిలవసాగాడు. ఒంట్లో నీరసం బాగా ఉంది. శక్తిలేదు. బలం తగ్గిపోయింది. ప్రార్థన చేయసాగాడు. మనసులో ఇలా అనుకుంటున్నాడు, "ఓ ప్రభూ! ఇదే నా ఆఖరిప్రార్థన" అని నమస్కరించసాగాడు. అతనిలో శ్రీహరిని చూడాలన్న ఉత్కంత ఎక్కువైంది. మనసులో వ్యాకులత పెరిగింది. హృదయంలోనుండి గోపాలుడు శ్రీహరిని పిలవసాగాడు. ఆ పిలుపు శ్రీహరియొక్క అంతరంగంలో ప్రవేశించింది. ఇంక శ్రీహరి ఎలా దాగి ఉండగలడు, తొందరగా గోపాలుని ఎదుట ప్రత్యక్షమయ్యాడు.

భగవంతుడి సుందరరూపం గురుదేవుడు చెప్పిన మాదిరిగానే ఉంది. ఆయన పీతాంబరాలని ధరించియున్నాడు. ముఖం ఎంతో మనోహరంగా ఉంది. ఆయన శరీరమంతా కాంతిపుంజంతో ఒప్పుతోంది. ఆయన హస్తపద్మంలో మురళి ఉంది. కోటి ప్రభలకాంతులతో ప్రకాశిస్తున్న ఆయనను చూసి గోపాలుడు ముగ్ధుడైపోయాడు. గోపాలుడు అప్పుడు పొందిన ఆనందానికి అంతులేదు. గోపాలుని నీరసించిపోయిన శరీరంలో

ఓరకమైన జాగృతి కనబడింది. అతనిలో ఓ నూతనచైతన్యం పొడచూపింది. అతనొక్కసారిగా భయభ్రాంతుడైపోయాడు. ధ్యానంలో ఏరూపాన్ని భావించాడో అదేరూపం. కన్నులముందు సాక్షాత్కరించింది. కనులు మూసినా తెరిచినా అదే రూపం అతని హృదయంలో ఆనందం సముద్రంలా ఉప్పొంగింది. అతని కళ్ళనుండి ఆనందబాష్పాలు కారసాగాయి. వెంటనే గోపాలుడు భగవంతుని పాదాలపై పడ్డాడు శరీరమంతా పులకరించిపోతోంది. అతని కన్నులనుండి కారిననీరు ఆ స్వామి పాదాలను తడిపింది. నోటమాట రావడంలేదు.

భగవంతుడతణ్ణి లేవదీసి తన కరకమలాలతో అతని కన్నీటిని తుడిచాడు. భగవంతుని కనులనుండి అమృతధారాప్రవాహం అతనిమీద పడుతుండగా, "చూడు! గోపాలా! ప్రేమతో నువ్వు నివేదించిన ఆహారాన్ని తింటున్నాను. నేను భక్తిప్రేమలతో అర్పించిన అన్నాన్నే తింటుంటాను. భక్తుల భక్తియే నాకాహారం. ఎప్పుడూ నా ఆకలితీరి నాకడుపు నిండుగానే ఉంటుంది. ఈపైన నీకెలాంటి బాధలుండవు. భార్యాపిల్లలతో సుఖంగా ఉండు. మరణానంతరం గోలోకానికొచ్చి సుఖంగా ఉండవచ్చు" అన్నాడు.

గోవిందుడీ మాటలు చెప్పి అంతర్ధానమయ్యాడు. గోపాలునికింకా ఏదో చెప్పాలనే ఉంది. కాని, అతని నాలుక పలుకలేక గొంతు మూగబోయింది. భగవంతుడేదిశగా అంతర్ధానమయ్యాడో ఆ దిశకే గోపాలుడు చూడసాగాడు. భగవంతుని అంతర్ధానాన్ని గోపాలుడు సహించలేకపోయాడు. ఏడ్చాడు. తర్వాత ఎలాగో గుండెరాయి చేసుకొని ఆ మూర్తిని దర్శించినందుకు ఎంతో సంతోషపడుతూ, ఆయన భుజించిన శేషాహారాన్ని గోపాలుడు భుజించాడు. భగవంతుని ప్రసాదం తింటుంటే అతనిలో ఎంతో శాంతి, ఆనందం కలిగాయి. ఆ ప్రసాదం తింటూ తన గురువుని తలుచుకొని ఆయన సుగుణాలను కీర్తించాడు. అతని ముఖంనుండి "జయగోవింద! జయగురుదేవ! జయగోవింద గోవింద అన్న మాటలు వెలువడజొచ్చాయి.

భోజనంపూర్తి అయింది. ఇరవైఏడురోజుల ఆకలి శాంతించటం



కాదు జన్మజన్మాంతరాల ఆకలి దప్పులు శాంతించాయి. ఇదంతా గురు కరుణాకటాక్షంవల్లనే జరిగింది.

తన ఏకాంతత, శ్రద్ధ మూలంగా, పరమకారుణికుడైన దేవదేవుడైన గోవిందుని దుర్లభ దర్శనం చేసుకొని గోపాలుడు జీవితాన్ని సార్థకం చేసుకున్నాడు.

----oOo----

## 4. భక్త శాంతోబా దంపతులు

మొగలులు రాజ్యం చేస్తున్నకాలంలో శాంతోబా అనుపేరుగల ధనికుడుండేవాడు. శాంతోబా సుఖాలకేమి కొరతలేదు. గౌరవప్రతిష్ఠలకి లోటులేదు. ఇరవైనాలుగు గంటలు షోకులూ, మోజులూ, సరదాలతో హాయిగా ఉంటున్నాడు. నిజమైన ఆనందాన్ని గురించి అతనేనాడు స్వప్నంలో కూడా తలచటంలేదు.

భగవంతుడిలీల చాలా చిత్రమైనది. రాజును రాయిగాను, మహామూర్ఖుణ్ణి గొప్పజ్ఞానిగాను మారుస్తాడు. మనిషి జీవితంలో భగవంతుడి దయకలిగితే ఆశ్చర్యకరమైన సంఘటనలు సంభవిస్తాయి. భగవంతుడి దయా దృష్టి కలిగినంతనే ఆ సన్మార్గపంథాలోనికి వచ్చి, భగవత్ప్రాప్తికి అధికారం (యోగ్యత) కల్గిన వాడవుతున్నాడు. పూర్వపుణ్యాల కారణంగానూ, భగవంతుని అనుగ్రహంవల్ల శాంతోబా జీవితంలో కూడా ఇలాంటి పరివర్తన సంభవించింది. ఒక మహాత్ముడి దయవల్ల శాంతోబా జీవిత చక్రంలో హఠాత్తుగా మార్పు వచ్చింది.

ఒకానొక రోజున భక్తుడైన తుకారాం శాంతోబా ఇంటికొచ్చాడు. నిజమైన సాధువుని శాంతోబా కలసినందున అమోఘమైన ఫలితం కనపడింది. తుకారాంగారి గొప్ప ఉపదేశాలు శాంతోబా హృదయంలో మంత్రంలా పనిచేశాయి. అతని భ్రమలని దూరం చేసాయి.

సాధువుయొక్క కలయికవలన శాంతోబాలో అపూర్వమైన ఆనందం ప్రాప్తించినట్లైంది. ఈ భగవదానందం ముందు సంసార సుఖభోగాలు చాలా నీచమైనవనిపించాయి. శాంతోబా కనులనుండి ఆనందం అశ్రురూపంలో బయల్వెడలింది. ఒక నూతనమైన భగవత్‌దృష్టి కలిగింది. ఇలా కలిగిన జ్ఞానం ద్వారా సంసారంలోని విషయాలలో ఒక కొత్తదనం కానవచ్చింది. ఇది శాంతోబా జీవితంలో నవప్రభాతకిరణాలను వెలిగించింది".

ఈనాడు శాంతోబా జీవనం మారిపోయింది. సంసార జీవనం ఇప్పుడు చాలా వ్యతిరేకంగా కనిపిస్తోంది. మొదట్లో సంసారమంతా అమృతభాండంలా కనిపించింది. అది ఇప్పుడు విషంలా కనబడుతోంది అప్పట్లో అన్నీ "నావినావి" అన్పించేవి. ఇప్పుడవి చూడడమంటేనే అసహ్యం. అతని హృదయవీణ మీద స్వతంత్రమనే రాగాలాపన జరిగింది. దాని ఫలితంగా శాంతోబాలోని అహంకార రూపమైన దీపక్‌రాగం శాంత శీతలస్వరూపాన్ని పొందినది.

శాంతోబాలోని వికారాలన్నీ పోయాయి. ఇంతవరకూ అతని మనసులో కాంతాకనకాలమీద, ఆ సుఖాలపైనే ఆసక్తి ఎక్కువగా ఉండేది. ఇప్పుడు అటువంటి ఆలోచనల స్థానంలో ఇంకో కొత్త ఆలోచనలు చోటు చేసుకున్నాయి. "నేను కేవలం తుచ్ఛమైన మనుష్యసుఖాలకి ప్రాముఖ్యమిచ్చి తెలుసుకోవలసిన దాన్ని తెలుసుకోక అమూల్యమైన కాలాన్ని వ్యర్థం చేసుకున్నాను. శ్రీహరి చరణాలకన్నా ఈ లోకంలో గొప్పదేదీ లేదని అర్థమైంది. ఆ శ్రీహరి పాదపద్మాలను ఆశ్రయించేది ఎట్లా? నా జీవనం పూర్తయే క్షణాలు దగ్గరౌతున్నాయి. కొద్దిరోజుల్లో నేను చేసిన పాపాలకి శిక్షవిధించడానికి యమదూతలు వచ్చి మృత్యుపాశాన్ని మెడకిచుట్టి తీసుకుపోయి యముడి ముందుంచుతారు. యముడు "ఏమిటి నీ సంగతి?" అని అడిగితే ఏం జవాబివ్వగలను? ఓ భగవంతుడా నేనిప్పుడు ఏంచేయాలి?" అన్నది ప్రశ్న".

ఇటువంటి సత్యవిచారణ మనిషి హృదయంలో కలగడంతో భగవానుడు అతని యోగ్యతనిబట్టి అందుకు మార్గం ఉపదేశిస్తాడు. గమ్యం



ఒక్కటే అయినా, అర్హతని అనుసరించి అందుకు తగిన మార్గాలు వేరుగా ఉంటాయి. శాంతోబాకి కూడా వ్యాకులచిత్తం ఏర్పడగా ప్రార్థన చేసిన పిమ్మట ఓ మార్గం దొరికింది. అంతర్యామి ప్రేరణ కలిగింది. ఆ భావనకలగగా ఆ విషయంలో ఆసక్తపెరిగింది. అంటే ఇల్లు, పరివారం, ధనం, ఐశ్వర్యం మొదలైన వాటినన్నింటినీ త్యాగంచేశాడు. తనకుగల సిరి సంపదలన్నింటినీ పేదలకు పంచిపెట్టి శ్రీహరి నామాన్ని గట్టిగా ఉచ్చరిస్తూ, ఇల్లువదలి బయలుదేరాడు. ఆ సమయంలో అతనికి మిగిలింది ఒక అంగవస్త్రం మాత్రమే. అంతకంటే నాది అని చెప్పుకునే వస్తువేదీ లేదు. లోకులేమనుకుంటారో అన్న భయంలేకుంటే ఆ అంగవస్త్రం కూడా ఉండేది కాదు. ఇంటి నుండి బైటకు వచ్చి హరినామస్మరణ చేసుకుంటూ వెడుతూండగా భీమానదిని చేరాడు. ఆ నది సుడిగుండాలతోను, తరంగాలతోనూ చాలా భయంకరంగా ఉంది. ఇంతకన్నా భయంకరమైన సంసారాన్ని లెక్కచెయ్యని శాంతోబా ఈ నదికి ఎందుకు భయపడతాడు? సంసార సాగరాన్ని నిర్భయంగా దాటడానికి బైలుదేరినవాడు నదినిచూసి భయపడటం అసంభవం. శాంతోబా నదికి అడ్డంపడి ఈతకొట్టుకుంటూ భగవంతుడి దయవల్ల అవతలిగట్టుకి చేరాడు. ఆ నది ప్రక్కనే ఓ పర్వతం ఉంది. నిర్భయంగా శాంతోబా ఆ పర్వతం ఎక్కాడు. ఆ పర్వతం మీద వాతావరణం చాలా శాంతంగా ఉంది. దానినైసర్గికశోభను చూడగానే మనసు ఆనందపులకితమైంది. చాలా హడావుడిగా వుండే పట్నంలో ఇటువంటి ప్రశాంత వాతావరణం ఎలా దొరుకుతుంది? ఆ పర్వతం మీది తీయనిహాయిని గొలిపే ఆ నిశ్శబ్ద గాంభీర్యత, ప్రవహించుతున్న సెలయేటి మధురజలాలు, రకరకాల రంగులతో కూడిన పక్షుల కిలకిలారావాలు చూస్తుంటే శాంతోబా మనసు చాలా సంతోషించింది. ఆ పర్వతగుహలో ఉంటు అందరి హృదయకుహరాలలో విహరించే శ్రీహరిని ధ్యానించుకుంటాననుకున్నాడు. పంజరాన్ని విడిచిన పక్షిలా పద్మ గర్భాన్ని విడిచిన తుమ్మెదలా స్వతంత్రంగా ఉంటూ ఏకాగ్రతతో అక్కడ తపస్సు చేసుకోవడం మొదలుపెట్టాడు.

ఆ వాతావరణంలో అతను అంతులేని ఆనందాన్ని అనుభవించ సాగాడు. పక్షుల కలకలధ్వనులు వింటూ, శాంతోబా "హరి హరి" అని

ధ్యానించుతున్నాడు. మయూరాలనాట్యాల్ని తిలకించుతూ నాట్యం చేస్తున్నాడు. సెలయేటి గలగల ధ్వనులతో సంగీత మిశ్రమంగా హరిగుణగానం చేస్తూ ఈ లోకాన్ని మరచి తన్మయచిత్తంతో ఉంటున్నాడు. పశుపక్ష్యాదుల అవ్యక్త ధ్వనులను అనుకరించుతూ అస్పష్టంగా స్వరాలాపనలని సాధనచేస్తున్నాడు. అతని అస్పష్టసంగీత ధ్వనులు, ఆలాపనా మధురతరంగాలతో ఆ అడవిభూములు, పర్వతగుహలు మారుమ్రోగుతున్నాయి. శాంతోబా ఆలాపనా సరళిని వింటున్న అటవీప్రాణి సమూహం, అతని గొంతునుండి వెలువడే మధురాలాపాలను వింటూ అతని చుట్టూ స్నేహపరివారంగా ఉంటున్నాయి. హింసాత్మకమైనవి, అహింసాత్మకమైన జంతుజాలం పరస్పర వైరభావం విడిచి ఒకరికొకరు ఆకర్షితమై అక్కడకలిసి ఉంటున్నాయి. వృక్ష, లతా, గుల్మాదులు అన్నీ అతని ప్రేమకి పరవశించి వంగిపోతున్నాయి. శాంతోబా ఉనికి మూలంగా ఆ వనభూములన్నీ పూలతో, పండ్లతో, చివురు జొంపాలతో, శోభతో అందంగా ఉన్నాయి.

## (2)

ఒకరికి ఇష్టమైనవి మరొకరికి అయిష్టం కావచ్చు, వనాల్లోకి వెళ్ళి భగవధ్యానం చేసుకోవటమంటే శాంతోబాకి ఇష్టం. అతనింట్లోవారికి అడవుల్లో వుండటంనచ్చదు. ఇది ఇంట్లో అశాంతికి కారణంగా ఉంది. ఇంట్లోవారు శాంతోబా భార్యను అతని వద్దకు పంపాలని నిశ్చయించారు. శాంతోబా అందమైన భార్యను తీసుకొని ఆ వనంనుండి ఇంటికి తిరిగి వచ్చేస్తాడని ఇంట్లోవారు భావించారు.

శాంతోబా భార్య వనాలలోవున్న భర్తదగ్గరికి వచ్చింది. ఆయన ఎక్కడ ఉంటే తనూ అక్కడే ఉండాలని నిశ్చయించుకుంది. ఆయన్ని సేవించుకుంటూ జీవించాలని నిర్ణయించుకుంది. ముఖం వంచుకుని అతని ఎదుటనిలిచింది. ఆమె మనసులో ఎన్నో సమస్యలు. మాట్లాడ్డానికి నోరాడలేదు గొంతుకనుండి ఒక్కమాట కూడా పైకి రాలేదు.

తన కత్యంత ప్రేమాస్పదురాలు, నిరుపమాన సుందరి అయిన



ధర్మపత్ని తన దగ్గరలో నిలబడటం శాంతోబా చూశాడు. కాని అతని మనసు చంచలం కాలేదు. ఇద్దరు ఎంతో సేపు మౌనంగా ఉండిపోయారు. అంతటి సౌందర్యవతి ఎదుటఉన్నా ఆయన మనసు ఏమాత్రం చలించలేదు. ఆయన మదనుణ్ణి జయించాడు.

అతనిపత్ని భర్తపాదాలపై తలాన్చింది. కన్నీటితో, "మిమల్ని భగవంతుడిగా సేవించాలనే గాఢాభిలాషతోనే ఇక్కడికి వచ్చాను. మిమ్మల్ని మించిన దేవుడు నాకీ లోకంలో ఎవరూలేరు. అని ఇలా చెబుతూండగా ఆమె కంఠం మూగబోయింది. మూర్ఛితురాలిలా భర్తపాదాలదగ్గర అలా ఉండిపోయింది.

ఎట్టకేలకు ఆయన ఆమెతో, "నువ్వు నాతోపాటే ఉండు. కాని ఇక్కడ నువ్వు నా పద్ధతిగానే ఉండాలి. విలువైన బట్టలూ ఆభరణాలు ధరించడంకాక నాలాగా సామాన్యంగా ఉండాలి. అలాకాదంటావా నీ దారిన నువ్వు వెళ్ళవచ్చు. ఎంతమాత్రం నిన్ను ఇక్కడ ఆపడం నా అభిమతంకాదు. ప్రస్తుతం ధరించిన రత్నాభరణాలు, విలువైన ఆభరణాలు తీసెయ్యి. ఒక తపస్వినిలా, ఆ భావనతోనే నువ్విక్కడ ఉండాలి. భర్త జీవితానికి అనుగుణంగా భార్యజీవితం ఉండాలి. భర్త పద్ధతికి మించిన వేషం ధరించడం పతివ్రతయొక్క లక్షణంకాదు.

అని చెప్పి, ఆమె తానుచెప్పిన విధంగా నడుచుకునేలా అంగీకరింపచేశాడు. ఆమె భర్త చెప్పినట్లుగా తనను మార్చుకొని ఆయనను సేవిస్తూ తన జీవితాన్ని పవిత్రం చేసుకోసాగింది. భర్తను సేవించడానికి చీనీ చీనాంబరాలుగాని, బంగారు ఆభరణాలుగాని అవసరంకావు.

## (3)

భార్యాభర్తలిరువురూ ఆ వనంలో తపస్సుచేస్తూ ఆనందంగా జీవిస్తున్నారు. ఆత్మసంయమనంతో ఆమెఎంతో ఎత్తుకెదిగింది. ఆమెలో సహనశక్తి పెరిగింది. శాంతోబా మనసులో ఒకనాడు ఆమెలో ఎంత సహనశక్తి ఉందో తెలుసుకోవాలని ఓ కఠినపరీక్ష పెట్టాలనుకున్నాడు.

శాంతోబా దంపతులు అడివిలో దొరికే పళ్ళుతింటూ సెలయేటి నీరు త్రాగుతూ జీవిస్తున్నారు. అలా ఉంటుండగా ఒ రోజు శాంతోబా, భార్యతో, "ప్రియసతీ! రొట్టెతిని చాలాకాలం అయింది. నువ్వు ఊళ్ళోకి వెళ్ళి రొట్టె కాకపోయినా, ముక్కలైనా అడిగి పట్టుకురా" అన్నాడు.

భర్త మాటలు పూర్తికాగానే భార్య ఇలా అంది, "స్వామీ! మీ మాటప్రకారం ఇప్పుడే వెళ్ళి అడిగితెస్తా" అంది.

"వెళ్ళిరా! కాని, ఒక్కమాట రొట్టెలుకాదు, ముక్కలుమాత్రమే తేవాలి. అవిచాలు. మరేమీ తీసుకురావద్దు" అన్నాడు.

"మీరు చెప్పినట్లే చేస్తా" నని చెప్పి శాంతోబా భార్య భిక్షాటనానికి బైలుదేరింది. ఐశ్వర్యవంతురాలు. ఆగర్భశ్రీమంతుల ఇంటినుండి వచ్చిన అంతఃపురకాంత ఇప్పుడు భిక్షాటనకు బైలుదేరింది. పెట్టటం మాత్రమే తెలిసి అడగడం ఎరగని అబల. ఇలాంటి విషయాల్లో ఏమాత్రం అనుభవంలేని అమాయకురాలు. భిక్షాటనకు కూడా కొన్ని లక్షణాలుండాలి. అంటే ముఖం దీనంగా, కంఠస్వరం కృశించి, నడకనీరసంగా, కొద్దిగా వంగి, ఓ చేతపాత్ర పుచ్చుకొని, భిక్షం వేయమని అడగాలి. శిరస్సుమీద కేశజాలం చింపిరిగా ఉండాలి. చిరిగిపోయిన గుడ్డలుకట్టి ఉండాలి. ఈ అర్హతలన్నీ శాంతోబా భార్యకున్నాయి. ఆమె ఒంటిమీద ఏ ఆభరణంలేదు. అందమైన బట్టలులేవు. శిరోజాలు తైలసంస్కారం లేకుండా చింపిరిగా ఎగురుతున్నాయి. ఇలాంటి దయనీయ స్థితిలో ఉన్నా ఆమె ఎంతో శోభాయమానంగా ఉంది. ఆమె అందం సహజశోభలతో అలరారుతోంది. పతివ్రతతేజస్సు ఆమెముఖమండలంమీద అద్భుతంగా వెలుగొందుతోంది. ఆమె ఓ దేవతలా వుంది.

శాంతోబా భార్య ఇంటింటికీవెళ్ళి భిక్షం అడగసాగింది. అడుక్కుంటు వెరుతూ తన పెద్దవదిన ఇంటికి వెళ్ళింది. అంతట ఆమె పోల్చుకొని, భిక్షకురాలుగా వచ్చిన వదినను చూసి గొల్లుమని ఏడ్చింది. "వదినా! నాన్న సంపాదించినదంతా ఏదైనా కారణంగా నష్టం వచ్చిపోయిందా? నిన్నీస్థితిలో





చూడవలసిన గతిపట్టిందా? అనగా శాంతోబా భార్య ఆమెతో తన భర్త వైరాగ్యంపూని గృహంనుండి వెళ్ళిపోయిన సంగతి చెప్పింది. "నీ అన్నగారిని ఆకలితో ఉంచి నేనిలా వచ్చాను. నన్ను ఆపకు. ఇది నా భర్త ఆజ్ఞ. ఇవ్వగలిగితే ఓ రొట్టెముక్క ఇచ్చి నన్ను త్వరగా పంపు. లేదంటావా నేను మరో ఇంటికి పోతాను" అంది శాంతోబా భార్య తన ఆడపడుచుతో.

"వెళ్ళకు. ఆగు. ఇదిగోవస్తున్నా" అంటూ ఇంట్లోకి వెళ్ళి పెద్దపళ్ళెంలో హల్వా, పూరీ, కూర మొదలైనవి నిండుగాతెచ్చింది. కాని వీటన్నింటిని తీసుకునేందుకు శాంతోబా భార్య తిరస్కరించింది. కాని, ఆడపడుచు, వదిన గొడవపడడంతో ఎక్కువ ఆలస్యం అయింది. అవతల తన భర్త ఆకలితో ఉన్నాడు. ఇక్కడ ఇలా ఆలస్యం చెయ్యడం తగదని మనసులో అనుకుని ఆడపడుచు ఇచ్చిన పదార్థాలు తీసుకొని గబగబ అక్కణ్ణించి బైటకు వచ్చేసింది. దారి అస్తవ్యస్తంగా ఉన్నందువల్ల త్వరగా వెళ్ళలేకపోయింది. ఒక్కోసారి గబగబ పరిగెడుతోంది. ఒక్కోసారి మెల్లిగా నడుస్తూ, పడుతూ, లేస్తూ, మొత్తంమీద తొందరగా ఇల్లు చేరడానికి నడుస్తోంది. ఎంతో కష్టంమీద ఆమె శాంతోబాని చేరింది. ముష్టెత్తి తెచ్చిన ఆహార పదార్థాలను భర్త ముందుపెట్టి నిలబడింది.

శాంతోబా ఆమె తెచ్చిన పదార్థాలను చూశాడు. మరుక్షణంలో తీక్షణంగా ఆమెవైపు చూస్తు, "ఇటువంటి భోజనంకాదు నిన్ను నేను తెమ్మన్నది. నేను పట్టుకురమ్మన్న రొట్టెముక్కలేవి? ఈ పూరీ లేమిటి? ఈ హల్వా ఏమిటి? ఇదా నేను తెమ్మన్నది. పట్టుకుపోయి ఎక్కణ్ణించి తెచ్చావో, వాళ్ళకిచ్చెయ్యి. తేగలిగితే రొట్టెముక్కలే పట్టుకురా" అన్నాడు.

తాను ఊళ్ళోకి వెళ్ళి రొట్టెముక్కలు అడగటం వదినగారు కనబడటం, ఆమె ఇవన్నీ ఇచ్చారని అసలు విషయం చెప్పింది. ఆమె కోప్పడి ఇవన్నీ ఇచ్చారుకాని, నేనుతేలేదు అన్న భార్య మాటలువిని ఇందామె దోషమేమీ లేదని తెలిసికూడా శాంతోబా హల్వా, పూరీ తినడానికి నిరాకరించాడు.

"ఈమె హితంకోరే నేనీ కఠిన పరీక్ష విధించింది" అనుకున్నాడు శాంతోబా. కొండఎక్కడం, దిగడం, భిక్షం అడగడం లాంటి కష్టాలతో ఆమె శరీరం అలసిపోయింది. ఆయాసపడడం కూడా జరిగింది. ఆయినప్పటికీ భర్త మనసుకి సంతోషం కలిగించడమే ఆమెయొక్క వ్రతం. మనసా, వాచా కర్మణా పతిమార్గాన్ని తప్పక పాటించాలన్న లక్ష్యంతో ఆమె బయలుదేరింది. తాను తీసుకున్న పదార్థాలు ఆడపడుచుకు తిరిగి ఇచ్చివేసింది. ఇంటింటికి వెళ్ళి రొట్టెముక్కల్ని అడిగితీసుకుంది. వాటితో తొందరగా కొండవైపు నడవసాగింది. ఆరోజామె పాతివ్రత్య దీక్షకి పరీక్షా దినం. ఇంకా కొద్దిదూరం వెళ్ళవలసి ఉండగా బ్రహ్మాండమైన ఉరుములు మెరుపులతో కుంభవృష్టిగా వర్షం పడటం ఆరంభమైంది. నాలుగువైపులా చీకటి అలుముకుంది. ఇటువంటి స్థితిలో దారివెంట నడవడం చాలా కష్టమైందామెకు.

రొట్టెముక్కలు జాగ్రత్త పరచుకోవాలి. అందుకని తన చిరిగిపోయిన కట్టుచీర తాలూకు కొంగును మూతగా పెట్టి, మెల్లిమెల్లిగా ముందుకు సాగుతోంది. రొట్టె ముక్కలు ప్రస్తుతం ఆమె శరీరం కన్నా భద్రపరచవలసినవిగా ఉంటున్నాయి. ఎందుచేతనంటే అవి తన భర్తకర్పించి, ఆయన మన్నన పొందాలి. ఆమె వానకి తడిసిపోయి, ఒణుకుతూ, ఎలాగో వెళ్ళడానికి ప్రయత్నిస్తూనే ఉంది. ఇప్పటికామె నది ఒడ్డుదాకా చేరింది. ఇంక ముందుకు వెళ్ళడానికి సాధ్యం కాలేదు చాలా కష్టంగా ఉంది. ఇంకా అక్కడ నది ఒకటి దాటవలసివుంది. వానపడుతున్నందువల్ల నదికి వరదవచ్చి భయంకరంగా ప్రవహిస్తోంది. అక్కడ ఏ పడవాలేదు. నది దాటడానికి ఏ ఉపాయం కనబడడం లేదు. భర్తకి సమయానికి రొట్టెముక్కల్ని ఇవ్వడం ఎలా? భీమానది ఎంత భయంకరంగా ప్రవహిస్తోందో, మనసులో ఆమె ఆరాటం కూడా అంతగానూ ఉంది. ఎలావెళ్ళేది? ఏం చేసేది? పోనీ ఎవరినైనా ఏదైనా సహాయం అడుగుదామా అంటే ఆ ప్రాంతంలో మనిషిజాడ కూడాలేదు. అటువంటి భయంకర వాతావరణంలో తనకి రక్షకుడెవరు? ఆమె మనస్సు గాభరాపడిపోతోంది. సమయానికి భర్తని చేరడం అసాధ్యంగా కనబడుతుంది. చాలా ఆలస్యం అయిపోయింది. భయంతో చలితో శరీరం వణికి పోతోంది.



ఇంతవరకూ నా భర్త అన్నపానాదులు లేకుండా కూర్చుని ఉన్నారు. అయ్యో! భగవంతుడా! ఏం చేసేది? ఏది గతినాకు? ఓ పాండురంగప్రభో! ఒకసారి దయచూపు తండ్రీ! ఎక్కడున్నావయ్యా? ఈ నీ దీనురాలు, భక్తురాలి మొర ఆలకించవా స్వామీ!.

భక్తురాలి దయాపూర్ణమైన పిలుపుని భగవంతుడు అందుకున్నాడు. ఆమెను రక్షించడానికై మారువేషం ధరించి ఆమె ఉన్న ప్రాంతానికొచ్చాడు. "ఎవరమ్మా! ఇంతవానలో ఇక్కడ ఉన్నారు? ఈ కుంభవృష్టిలో ఎక్కడికి వెళ్ళడానికై ఇంత ఖంగారు పడుతున్నారు?" అని ఓ జాలరి ఆమెను ప్రశ్నించాడు. దీనికామె బదులు చెప్పలేదు. కన్నులు మూసుకొని పాండురంగదేవుణ్ణి మనసార స్మరించుకుంటోంది. ఆమె ఒక్కసారి కళ్ళు తెరిచింది. ఆ దగ్గరలోనే పడవతో ఒకడు ఉండడం చూసింది. గబగబ ఆ నావనడిపేవాని వద్దకువెళ్ళి తన కథంతా చెప్పి, "అయ్యా! భగవంతుడు పాండురంగడే నిన్నిక్కడికి నా సహాయానికి పంపినట్లుంది. నువ్వుగాక ఈ కష్టంలో నన్ను ఆదుకునే వారెవరు? నువ్వే నన్ను ఈ భీమానదిని దాటించాలి. ఈ గట్టునుండి ఆవలిగట్టుకి నన్ను చేర్చాలి తండ్రిలాగానో, అన్నవలెనో నన్నీ ఆపదనుండి కాపాడుటకు ఆ దేవుడే నిన్ను పంపినట్లుంది. నా భర్త అన్నపానాదులులేక నాకోసం ఆకలితో అలమటించిపోతుంటారు. కరుణించు నిన్ను బతిమలాడుకుంటున్నాను. నా భర్త ఆకలి తీర్చాలి. వేగంగా ఈ నదిని దాటించి పుణ్యంకట్టుకో" అందామె.

అటువంటి వాతావరణంలో, ఆ స్థితిలో ఆమెను చూసేసరికి నావికుడి హృదయం కరిగిపోయింది. ఆమెను తన భుజాలమీదికెక్కించుకొని, నది దాటించి వారు నివసించే పర్ణకుటీరం దగ్గరదించి, ఆమెకు కృతజ్ఞతలు చెప్పుకునే అవకాశం కూడా ఇవ్వకుండా అదృశ్యుడయ్యాడు. భగవంతుని భక్తవత్సలత అటువంటిది.

అటువంటి భయంకర వాతావరణంలో, వర్షంలో తడిచిముద్ద అయిపోయి, చలితో వణుకుతూ, ఓ చేతిలో రొట్టెముక్కల్ని రక్షించుకుంటూ, తడబడుతున్న పాదాలతో పర్ణకుటీవైపుగా నడవసాగింది ఆ పతివ్రత.

చాలీచాలని బట్ట ఆమె చేతిలోని రొట్టెలు కప్పడానికి ఉపయోగించగా, శరీరంమీద ఆచ్ఛాదన సరిగ్గా లేకున్నది. ఆమె ఆ విషయాన్ని గమనించుకోలేదు. ఇటువంటి స్థితిలో నావికుడు తన గురించి ఏమనుకున్నాడోనని తలపోసింది. పర్ణకుటిలో ప్రవేశిస్తు రొట్టెలపై కప్పబడిన బట్టనంతను విప్పి యధాపూర్వకంగా శరీరంమీద సర్దుకొని, ముఖంమీద పడిన వానచినుకులను తుడుచుకుంటూ ఓ చేత్తో రొట్టెలు పట్టుకొని నడుచుకుంటు వెళ్ళి భర్త దగ్గరపెట్టి ఆయన పాదాలకి నమస్కరించింది.

భర్త ఆకలి తీర్చడానికి, ఈ రొట్టెముక్కలకోసం ఎంతో కష్టపడిందామె. ఆ వర్షంలో గుడ్డకప్పి జాగ్రత్తగా తెచ్చిన ఆ రొట్టెముక్కల్ని గబగబ ఆపేక్షతో, భయభక్తులతో శాంతోబా దగ్గర పెట్టింది. శాంతోబా ఏదోపరధ్యానంలో ఉండి ఆ రొట్టెముక్కలవైపు చూడలేదు. కాని, రొట్టెముక్కలు తీసుకొచ్చి పెట్టినప్పటినుండి ఆమెలో అపూర్వమైన కాంతితో కూడిన ఓ కొత్తదనం కనపడుతోంది. శాంతోబా ఆమెవైపు చూపుసారించి ఆమెలోగల నిరుపమాన తేజోవిరాజమానమైన కాంతిని చూశాడు. ఎలా వచ్చింది ఈ తేజస్సు ఈమెలో!. ఏ పాదస్పర్శవల్ల బల్లచెక్కల పడవ బంగారపు నావగా మారిపోయిందో, ఏ చరణధూళి తాకిడికి రాయి రమణిగా మారిందో, ఏ కరస్పర్శవల్ల కుబ్జ అందమైన యువతిగా మారిందో, ఆ పవిత్ర స్పర్శవల్ల, ఆ దేవదేవుని స్పర్శవల్ల శాంతోబా యొక్క పత్ని అతి మనోహర దివ్యకాంతితో తళతళ లాడుతోందంటే అది ఆ స్వామి కృపాకటాక్షమే. ఆమె శరీరంలో నుండి ఓ అపూర్వమైన విద్యుత్తులాంటి కాంతులు బహిర్గతమవుతున్నాయి. అప్పుడతను భార్యతో, "కృశాంగాలతో, పీలికల బట్టలతో అందవిహీనంగా ఉండే నీలో ఈనాడీ అపూర్వతేజస్సు ఎలా వచ్చింది? ఇంత దారుణమైన వర్షంలో, భయంకరమైన చీకటి వాతావరణంలో ఇంటికి ఎలా రాగలిగావు? ఆశ్చర్యంగా ఉంది నాకు చెప్పు" అనడిగాడు.

భార్య ఇలా అంది, "ప్రభూ! మీ దయవల్ల నదిని దాటడంలో నాకేమీ కష్టం కలగడంలేదు. నాకేమి అర్థంకావటంలేదు. అంతటి భీమానదిని ఎలా దాటిరాగలిగానో తెలియడంలేదు. మీ ఆజ్ఞప్రకారంగానే, మీ



తోబుట్టువు ఇంటికి వెళ్ళి, ఆమె ఇచ్చిన పదార్థాలన్నీ మంచిమాటలతో నచ్చచెప్పి ఆమె కిచ్చేసి, అక్కణ్ణించి ప్రతి ఇంటికీ వెళ్ళికొన్ని రొట్టెముక్కలు సేకరించాను. మీరు బాగా ఆకలిమీదున్నారని నాకు గుర్తుంది. అందుకే నేను గబగబ నడుచుకుంటూ కొంతదూరం వచ్చానోలేదో భయంకరమైన పెనుతుఫాను చెలరేగింది. ఆకాశాన్ని నల్లనిమబ్బులు ఆవరించుకున్నాయి. గాలితీవ్రంగా వీచడం మొదలుపెట్టింది. మెరుపులు ఉరుములు వచ్చేశాయి. కుంభవృష్టి కురిసింది. చలిలో ఒణుక్కుంటు తడిసి ముద్దయి పడుతూ, లేస్తు, రొట్టెముక్కల్ని ప్రాణంకంటె మిన్నగా రక్షించుకుంటు వచ్చాను. భీమానది వరదలతో నిండి వడివడిగా భయంకరంగా ప్రవహిస్తోంది. అక్కడంతా నిర్మానుష్యం మనసులో త్వరగావచ్చి భోజనం మీ ముందు ఉంచాలన్న తపన. ఎలారాను! గత్యంతరం లేక భగవంతుణ్ణి ప్రార్థించుతూ కూర్చున్నాను. ఆ ప్రార్థనలో ఈ లోకాన్ని మరిచాను. కొంచెంసేపటికి కళ్ళు తెరిచి చూసేసరికి, ఓ నావికుడు దగ్గరలో కన్పించాడు. అతణ్ణి కేకవేసి నా కథంతా చెప్పాను. వెంటనే నన్ను భుజాల మీద కూర్చోబెట్టుకుని ఇవతలి ఒడ్డున దింపేసి వెంటనే ఎటో వెళ్ళిపోయాడు. నేను విస్తుబోయి కొయ్యబారి నిల్చుండిపోయాను. ఈ సన్నివేశం చూస్తుంటే గుండె దడదడ కొట్టుకుంది. పాండురంగనామస్మరణ చేసుకుంటూవచ్చి మన కుటీరపు మెట్టుమీద అడుగిడగా కొండంత ధైర్యంవచ్చింది. కైలాసంమీద పార్వతి రాక్షసుల్ని చూసి భయపడి పరుగునవచ్చి, శివుణ్ణి చూసినట్లుగానే, మిమ్మల్ని చూసి ఎంతో ఆనందపడిపోయి హమ్మయ్య! అనుకున్నాను స్వామీ!" అందామె.

శాంతోబాకి ఆమెచెబుతున్న మాటలు వింటుంటే శరీరం పులకించింది. అతనామెతో "ఓ పుణ్యవతీ! ఆ నావికుణ్ణి నాకు చూపుతావా, ఈ సంసార సాగరాన్ని తరింపచేయగల ఆ భగవంతుడికోసమే నా తపస్సు నా ధ్యానం, నా చింత, నా అన్వేషణ. దేవీ! ఆ మనోహరమూర్తిని చూడాలని నా తహతహ. అందుకోసమే ఈ నిర్మానుష్య వనాల్లో, ఈ అరణ్యాల్లో అన్వేషిస్తున్నాను. ఆలోచిస్తున్నాను. ఎందరో లేడంటున్నా నేను ఉన్నాడని నమ్మి కనులారా తాండవకృష్ణమూర్తిని దర్శించాలనే నా మనోవేదన" తననుతాను మైమరచి శాంతోబా ఇలా ఉంటుండగా,

మునిమానస హంసి అయిన భగవంతుడు శాంతోబా కనులముందు నిలబడ్డాడు. లోకసమ్మోహన కరమైన శ్యామసుందరుని దర్శనం చేసుకొని శాంతోబా హర్షపులకితానందంతో పరవశించిపోయాడు. అతని మనసు మందాకినీ తరంగాలమీద తేలియాడే హంసలా ఉంది. ఇది భ్రమా! సత్యమా! అని మరోసారి కళ్ళుతెరిచి తేరిపారగా చూడసాగాడు. ఆయన దర్శనభాగ్యాన్ని ఎంతసేపు చూసుకొని ఆనందించాడో తెలియదు. ఆ మూర్తిని ఇంకా దర్శించుతుండాలన్న ఆశ మిక్కుటంగా ఉంది. ఆ జగన్నాటక సూత్రధారి యొక్క దివ్యసుందర దర్శనాన్ని తనివితీరా దర్శించినా చాలు. అలా దర్శించిన వారు ఇకచాలు అని అనలేరు. అలా చూస్తుంటే ఆయన మూర్తిని దర్శించుతుంటే పిపాసలేదు. బుభుక్ష అంతకన్నా లేదు. ఆ దివ్యమూర్తి దర్శనంవల్ల కలిగిన ఆనందం హృదయంలో మిగిలింది. దాంతో ఈ లోకాన్ని ఎంతోకాలం మరిచిపోయాడు.

ఆయనను తలచుతూ స్తంభించిపోతున్నాడు. ఓ ప్రభూ! అంటూ ఆయన గుణగానం చేస్తున్నాడు. ఒకోసారి తనని ఓ దాసిగా భావించి నాట్యం చేస్తున్నాడు. పొంగిపొరలి వచ్చే ఆనందంతో భూమిమీదపడి దొర్లుతున్నాడు. ఆ తన్మయత్వంలో ఏం చేస్తున్నదీ ఎరుగడు. అతని దృష్టిలో పరమాత్మ భావం విరాజిల్లుతోంది ఇదంతా చూస్తున్న పరమాత్మ ప్రసన్నుడయ్యాడు. భక్తుని పవిత్రమైన మనసు, ఆనందరసమయమైన హృదయం తెలుసుకొని శాంతోబాని తీయని మధుర స్వరంలో, అమృతగుళికలవంటి వాక్యాలతో, దీవిస్తూ అంతర్ధానం చెందాడు భగవంతుడు.

శాంతోబా పరిస్థితి ఎలాగో అయిపోయింది. ఆనందపారవశ్యంలో ఉండిపోతున్నాడు. తన్మయుడై ఆ విశ్వసుందరమూర్తితో ఆడుకుంటున్నాడు. ఈ ప్రాపంచిక విషయాలను పట్టించుకోవటంలేదు. కొన్ని రోజుల వరకూ ఆనంద సమాధిలో నిమగ్నమై ఉన్నాడు. మనసా, వాచా, కర్మణా, ఆ భగవంతునిమీద విశ్వాసం కలిగి ఉంటున్నాడు. భార్య అనుకూలవతి కావటంవల్ల శాంతోబాని చూసుకుంటు ఆయన పరిచర్యలకు పూనుకుని



సదా అదే లోకంగా ఉంటోంది.

అతని భక్తి ఓ మధుర ప్రవాహంలా ప్రవహింప సాగింది. అతని అడుగుజాడలలోనే అతని భార్య కూడా భక్తి ప్రధానంగా జీవితం గడుపుతోంది. శాంతోబా భార్య పవిత్ర హృదయంలో భక్తి మిక్కుటమైంది. పవిత్రమైన ఆశయాలుగల ఆదర్శదంపతులుగా, భక్తి ప్రధానమైన వారి కీర్తి, ప్రతిష్ఠలు దేశదేశాంతరాలలో వ్యాపించసాగాయి. వారిలోని శాంత గుణం వారి అంతరంగిక లక్షణంగా వారి హృదయాల్లో మాత్రమే నిక్షిప్తంగా ఉండలేదు. అది లోకకల్యాణకరంగా మారింది. చాలామంది రోజూవచ్చి వారిని దర్శించుకొని కృతార్థులౌతున్నారు. సాధారణంగా శాంతోబా భిక్షకోసం వెడుతున్నవేళ లోకంలో భక్తి భావాన్ని ప్రచారం చేస్తున్నారు. అతడు ఒకనాడు భిక్షని యాచించుతు ఓ బ్రాహ్మణుని ఇంటికి వెళ్ళాడు. ఆ బ్రాహ్మణుడు ఇంటలేడు బైటికివెళ్ళాడు. బ్రాహ్మణుని భార్య ఉన్నది. బ్రాహ్మణుని ఇల్లాలు చేయాల్సిన భిక్షాదానాది సత్కారాలు చేసి వినమ్ర భావంతో, "మహాశయా! నా భర్త ఏకారణం లేకుండానే ఒక్కొక్కసారి చాలా గొడవ చేసేస్తుంటారు. గట్టిగా నాతో వివాదపడి బైటకు వెళ్ళిపోతుంటారు. ఒకవేళ అలా వెళ్ళిపోయి తిరిగి ఇంటికి రాని పక్షంలో నాకు దిక్కెవరు స్వామీ! ఇది నాలో తీరని చింతగా ఉంది. ఇదే బెంగ నన్ను పీడిస్తోంది. కాని, నేనాయన మాటలకు ఎదురాడను. ఇంకా ఆయన చెప్పినట్లే ఆయన ఆజ్ఞలను పాటిస్తూనే ఉంటాను. అయినా వారు నన్ను ఏదో అపార్థంచేసుకొని, వివాదంలేవదీసి, సంసారాన్ని అశాంతి పాలు చేస్తున్నారు. అటువంటప్పుడు నామీద దయలేకుండా ప్రవర్తిస్తారు. ఓ సాధు మహారాజా! ఆయన నా ఎడ ఈ దెబ్బలాట ధోరణిమాని శాంతంగా, అనుకూలంగా, ఉండేలా ఆశీర్వదించండి స్వామీ" అంది.

ఆమె మాటలువిని ఆమెకు ఊరట కలిగించేలా, శాంతోబా ఇలా అన్నాడు, "అమ్మా! విచారపడకు. నీ విచారం పోయేలా ప్రయత్నిస్తా. నీవు ఓ పనిచెయ్యి. నీ భర్తని నావద్దకు పంపు. అప్పుడు నేను చెప్పవలసినది చెబుతాను దాంతో మళ్ళీ నీతో గొడవపడకుండా సఖ్యతగా ఉంటాడు. నేనాయనను దారిలో పెట్టగలను" అని శాంతోబా వెళ్ళిపోయాడు.

ఇలా ఉండగా ఒకనాడు మళ్ళీగొడవైంది. అప్పుడు బ్రాహ్మణుడు ఇలా అన్నాడు, "నువ్వు నన్నిలా ఏడిపించావంటే నేను శాంతోబా ఆశ్రమానికి వెళ్ళిపోయి అక్కడే ఉండిపోతాను" అన్నాడు. ఆ మాటలకతని భార్య "వెడితే వెళ్ళండి నేనేమి మిమ్మల్ని ఆపటంలేదు. వెళ్ళండి అక్కడికే వెళ్ళండి" అంది.

ఇలా భార్య ఎదురుచెప్పడం బ్రాహ్మణుడికి చాలా అగౌరవంగా అన్పించింది. ఆమె మీద అసహ్యంతో ఓ కంబళి, ఓ పాత్ర తీసుకొని ఇంట్లోనుండి వెళ్ళిపోయాడు. నడుచుకుంటు అతను శాంతోబా ఆశ్రమానికొచ్చాడు. నడుచుకుంటూ వెళ్ళేసరికి అలసి పోయాడు. కాంతివిహీనంగా ఉన్నాడు. కొద్దిసేపు శాంతోబా పాదాల మీదపడి ఇలా తన బాధనంతా వెళ్ళబుచ్చుకున్నాడు.

"మహానుభావా! మా యింట్లే నా భార్యతో చాలా విసిగివేసారి, దెబ్బలాటలు భరించలేక, శాంతిలేని కారణంగా మీ ఆశ్రమానికి వచ్చేశాను. ఓ స్వామీ! దయదలచి నాకు శాంతిగా ఉండేలా మార్గం ప్రసాదించండి అనగా విని శాంతోబా, అతణ్ణి ఊరడిస్తూ అనునయంగ, "ఆర్యా! నీవు వైరాగ్యభావంతో ఇక్కడికి వచ్చావు. బాగానే ఉంది. ముందు ఆ కంబళి, చెంబు అలా వుంచి, ఆ ప్రవాహంలో ఒక్కసారి కాసిన్ని నీళ్ళు తీసుకొని మొహం, కాళ్ళు, చేతులు, కడుక్కొని విశ్రమించు అన్నాడు.

బ్రాహ్మణుడిలోని అశాంతి ఇంకా తగ్గలేదు. అతని ఆస్తిగా వున్న కంబళిని, చెంబునీ విసిరేసి ఓ కౌపీనంలాంటిది ధరించాడు. చేత్తో ఓ చిన్నకుండ తీసుకొని నీళ్ళు తీసుకురావడానికి ఏటికి వెళ్ళాడు. బ్రాహ్మణుడు తిండిలేక రోజంతా ఆకలిబాధతో నకనకలాడిపోతున్నాడు. ఇంట్లో కోపగించి ఆశ్రమానికి పరిగెత్తుకొచ్చాడు. "అక్కడ సిద్ధంచేసిన మంచి ఆహారాన్ని వదులుకొని ఆకలితో ఇక్కడికొచ్చాను. ఇక్కడికి రాగానే భోజనం కడుపునిండా దొరుకుతుందని ఆశించాను. నా దుర్దశను గ్రహించి ఆశ్రమంలో తనవద్ద ఉంచుకుంటాడని భావించాను. కాని దానికి వ్యతిరేకంగా ఇక్కడి అనుభవం వుంది. అసలు భోజనం సంగతే కనబడదు.



నీరు తెచ్చుకొని తాగమన్నాడే ఈ సాధువు అనుకుంటూ నీళ్ళు తాగాడు. ఆకలికాస్త శాంతించింది. కాని, బ్రాహ్మణుడి ముఖంనుండి అలాగే సణుగుడో గొణుగుడో వినబడుతోంది. మెల్లిమెల్లిగా వైరాగ్యభావం కాస్త తగ్గడం మొదలైంది. ఇంటిమీద కలిగిన కోపం సర్దుకుంటోంది. అతను ఏటినుండి మట్టిపాత్రతో నీళ్ళుతెచ్చుకుంటుంటే పాదాలు నొప్పి పుట్టాయి. కడుపులో అగ్నిలా ఆకలిమంటలు లేస్తున్నాయి. ఇలాంటి తక్కువ రకం స్థాయి (నాసిరకం) వైరాగ్యం ఎంతకాలం ఉంటుంది? బ్రాహ్మణుడు నీళ్ళు తీసుకొని ఆశ్రమంలో ప్రవేశించాడు. బ్రాహ్మణుడు వచ్చిచూసేసరికి శాంతోబా అతని భార్య భోజనం చేస్తున్నారు. ఆ దృశ్యం చూసేసరికి బ్రాహ్మణుడిలో ఉన్న ధైర్యమంతా నీరుకారిపోయింది. కడుపులో ఆకలిమంటలు లేస్తున్నాయి. చేతిలో వున్న పాత్రని ఒకచోటపెట్టి "మహాత్ములారా! నాకు చాలా ఆకలిగా ఉంది. ఏదైనాకాస్త నేను తినడానికి త్వరగా పెట్టండి, పొట్టమీద, ముఖం మీద చెయ్యివేసుకొని సిగ్గువిడిచి దీనస్వరంతో అడిగాడు. శాంతోబా అతనికి రెండు మూడు పళ్ళిచ్చాడు. బ్రాహ్మణుడిలోని అహంకారం చల్లారిపోయింది. శుభ్రంగా కడుపునిండుగా తినేవాడికి రెండుమూడు పళ్ళతో ఆకలేం తీరుతుంది? ఉండబట్టలేక ఆకలితో గట్టిగా కేకలువేశాడు. "ఏమయ్యా! పెద్దమనిషి నేను ఆకలి మంటతో బాధపడుతున్న అతిథిని ఏదోరెండు మూడు పళ్ళు పడేస్తే నా ఆకలి తీరుతుందా?" అన్నాడు.

బ్రాహ్మణుడి మూర్ఖత్వంచూసి శాంతోబా నవ్వుకున్నాడు. కొంచెంసేపాగి, "ఏమయ్యా! నువ్వు వైరాగ్యం పూనావా లేదా? అన్నపానాదుల మీద ఇంత ఆప్యాయత ఉంటే వైరాగ్యంపూనడంలో అర్థమేముంది? నాయనా! వైరాగ్యం అన్నది చాలా కఠినమైన అవస్థ. విరాగి దొరికిన దాంతో సంతోషించాలి. సమయానికి వైరాగ్యం పొందినవారు ఏది దొరికితే అది భుజించి సంతోషపడాలి".

శాంతోబా అన్నమాటలు వింటుండగా బ్రాహ్మణుడి వైరాగ్యం అంతా నీరు కారినట్లయిపోయింది. తాను చేసినపనికి బ్రాహ్మణుడు పశ్చాత్తాప్తుడయ్యాడు. మనసులో ఇలా అనుకోసాగాడు. "ఇలాంటి

పస్తులుపడి బాధపడే వైరాగ్యం తగనిది. ఇంతకంటే ఇల్లే నయం అనుకొని తన కంబళిని, పాత్రనీ తీసుకోవడానికి అటుయిటు చూశాడు. అవేవీ కనబడలేదు. బ్రాహ్మణుడు కుండతో నీళ్ళు తెచ్చుకునేందుకు వెళ్ళినప్పుడు శాంతోబా ఈ విషయంలో ఏర్పాట్లు చేశాడు. బ్రాహ్మణుడు వెదగ్గా ఓ పాతబట్ట పీలిక మాత్రం దొరికింది. ఇదంతా శాంతోబా ఆ బ్రాహ్మణుడి భార్యను కాపాడుటకు బ్రాహ్మణుడికి బుద్ధి చెప్పడానికి చేసినపని. ఇలా చేస్తేనే బ్రాహ్మణుడు దారికొచ్చాడు.

శాంతోబా చేసిన ఉపాయం చక్కగా ఫలించింది. గుడ్డలూ, కంబళి పోగొట్టుకున్న తర్వాత, చాలాబాధ కలిగింది. ఆకలి బాధకు తోడు ఇది అదనపు బాధ. ఇది తట్టుకోలేక బ్రాహ్మణుడు ఏడవసాగాడు. చిన్నపిల్ల వాడిలా ఏడుస్తు అతడు శాంతోబాతో, "అయ్యా! నేను మా ఇంట్లో ఉన్నట్లయితే ఈ పాటికి రెండు మూడుసార్లైనా భోజనం చేసేవాణ్ణి. సాధూ! నాకిప్పటికి అర్థమైంది. నిరపరాధురాలైన నా భార్యను ఏడిపించి ఇక్కడికొచ్చా. ఇప్పుడు నా భార్యకి ఈ మొహం ఎలా చూపను? ఎక్కడికెళ్ళి కడుపునింపుకోగలను? ఈ విషయంలో దయదలచి నాకు మంచి సలహా ఇవ్వండి" అన్నాడు.

శాంతోబా జవాబిచ్చాడు. "నాయనా! వైరాగ్యమార్గం అంటే కంబళి వేసుకొని, చెంబుపట్టుకుంటే సిద్ధించేది కాదు. వైరాగ్యం సిద్ధించాలంటే నిగ్రహం ఉండాలి. సంసార కష్టాలు ఒంటపట్టి బాధలకి కనులనీరు తిరుగుతుంటే గాభరాపడుతూ దిక్కులేక వైరాగ్యంపూనటం కాదు. స్వాభావికంగా విషయాల మీద వాంఛలుతగ్గి సావధానం కలిగి ఉంటే వైరాగ్యమార్గం పట్టొచ్చు. అందుచేత నీబోటివాడికి గృహస్థాశ్రమమే తగినది. అందువల్ల ఇంటికి వెళ్ళి గృహస్థధర్మం సరిగా నడుపుకొని నీ జన్మ సార్థకం చేసుకో. నేనుకూడా వచ్చి నీ భార్యకు కాస్త సముదాయింపు మాటలు చెబుతాను, అని శాంతోబా బ్రాహ్మణుణ్ణి వెంటబెట్టుకొని అతని గృహానికి వెళ్ళాడు. ఆమెకి అతనికి చక్కని బోధచేసి, "నీ భార్యతో దెబ్బలాడకు"మని బ్రాహ్మణుడికి చెప్పి వారి జీవితాన్ని సరిదిద్ద తన ఆశ్రమానికి తిరిగి వచ్చాడు. శాంతోబా ఆశీస్సులందుకున్న బ్రాహ్మణుడి



భార్య పతిసేవచేస్తూ, శ్రీహరి ధ్యానంతో గడపసాగింది. బ్రాహ్మణుడు కూడా భార్యతో కలహాలకు దిగకుండా ఇల్లువిడిచిపోతానని బెదిరించకుండా బుద్ధిగా ఉంటూ శ్రీహరి ధ్యానంలో ఉండసాగాడు.

దక్షిణదేశంలో ప్రసిద్ధి చెందిన పుణ్యతీర్థం పండరీపురం. అది భూమికి దిగి వచ్చిన స్వర్గంలాంటిది. అక్కడ ఎందరో భక్తులు ఏకాదశినాడు గుమి గూడుతారు. అప్పుడది తీర్థంలా ఉంటుంది. వేలాది భక్తులు ప్రతి ఏకాదశినాడు స్వామి దర్శనానికి వస్తుంటారు. ఆషాఢ ఏకాదశినాడైతే లక్షలాది భక్తులొస్తారు. అది చాలా పెద్ద 'మేళా' (ఉత్సవం).

ఒకసారి శాంతోబాకి ఓ ఏకాదశికి పండరీపురం వెళ్ళాలనిపించింది. శాంతోబా, అతని పత్ని, కొందరు బ్రాహ్మణులు అనుసరించిరాగా పండరీపురం వెళ్ళడానికి బాజాభజంత్రీలతో మరికొందరు భక్తులు శ్రీహరి నామసంకీర్తనలతో సాగనంపగా బయలుదేరి వెళ్ళారు. అలా భజనలు చేసుకుంటూ నరసింహపురం చేరారు. ఆ నాడు దశమి తిథి. పండరీపురానికి, నరసింహపురానికి మధ్యగా ఓ నది ప్రవహించుతోంది. అది నిండు ప్రవాహంకలిగి తరంగాలతో దాటశక్యంగాకుంది. ఆ నది దాటడానికి ఓ నావగాని, ఓ నావికుడుగాని కానరాలేదు. ఆ నది దాటివెళ్ళాలంటే ఈదుకుని ఆవలి ఒడ్డుకువెళ్ళాలి. ఇది తప్ప ఇంకో ఉపాయంలేదు. ఆ నది దాటడానికి శాంతోబా దంపతులు సిద్ధపడ్డారే కాని ఇంకెవ్వరూ సాహసించలేకపోయారు. దశమి వెళ్ళి ఏకాదశితిథి తెల్లవారేసరికి వస్తుంది. ఆ ఉదయానికి పండరీపురం వెళ్ళి స్వామి పూజాదులుచేయాలి. ఇటువంటి పరిస్థితిలో నది దాటి వెళ్ళవలసి ఉంది. నది దాటడానికి తోటివారు భయచకితులయి ఉండగా శాంతోబా వారితో "ఈ చిన్న నదిని దాటడానికి ఇంత భయమా? ఈ తరంగాలు ఓ లెక్కా! సంసారసాగరాన్ని దాటడానికి ఈదులాడుతున్నాము. శ్రీహరి మనకు సహాయంగా ఉండగా భయపడడుందేనికి? భగవంతుని చరణ కమలాల్ని పట్టుకొని మనజీవితాల్ని అర్పించి ముందుకు సాగుదాం. నేను ముందు నడుస్తుంటాను. మీరు నావెనుకగా రండి చావు బ్రతుకు అన్నమాటలు విడవండి. శ్రీహరి నామాన్ని గట్టిగా అంటూ తన్మయులమై ముందుకు నడుద్దాము" అంటూ శ్రీహరి

నామాన్ని పలుకుతూ శాంతోబా నదిలోదిగి నడవసాగాడు. అతనివెంట అతని భార్య, ఆమెవెంట ఉన్నవారు అనుసరించారు. శ్రీహరి నామం ఉచ్చరిస్తుంటే దశదిశలు మార్మోగ సాగాయి. శ్రీహరి నామామృతం హృదయకుహరాలను పవిత్రం చేస్తోంది. హృదయపూర్వకమైన భక్తితో చేస్తున్న శ్రీహరి శబ్దధ్వని వినబడి శ్రీహరి దిగివచ్చేలా ఉంది. శ్రీహరి నామోచ్చారణాశక్తి అద్భుతం! ఆయన భక్తవత్సలుడు. నదిదాటి వెళుతూంటే అదే ఓ మార్గం అయింది. ఇప్పుడు ఆవలిగట్టు చేరడానికి కష్టమేమీలేదు. భగవంతుడు దారి చూపుతుండగా అంత కటిక చీకటిలో ఆ నదీప్రవాహాన్ని దాటుతున్నారు. శ్రీహరి అండ ఉండగా ఇదో పెద్దవిషయంకాదు.

ఉదయంకాకముందే అందరూ పరమానందభరితులై పండరీపుర దేవాలయప్రాంగణానికి సంతోషంతో గోవిందనామస్మరణ బలంతో చేరుకున్నారు. భగవానుడైన విఠలనాథుణ్ణి చూడ్డానికి సిద్ధమయ్యారు. చంద్రభాగా నదిలో స్నానం చేశారు. శ్రీవిఠలనాథుడు పుండరీకుడి కోసమే అక్కడవెలిశాడు. అందుచేత ముందుగా పుండరీకునికి పూజ జరుగుతుంది. ఆ తర్వాత పాండురంగనికి పూజ చేస్తారు. అందరూ విఠలనాథుణ్ణి పరమానంద భరితులై దర్శించారు. అక్కడ ఆ దేవుణ్ణి చూసి శాంతోబా తన్మయుడైపోయాడు. ఆ చిత్తస్థితిని వర్ణించడం కష్టం. అతని ఆనందానికి అవధులులేవు. పాండురంగనాథుని భక్తిలో తన్మయుడై నాట్యం చేస్తు, గానం చేస్తు, భజన చేస్తు పరవశమై పోయాడు.

చివరికి కన్నీళ్ళతో, దయాపూరితమైన హృదయంతో భగవంతుని ప్రార్థిస్తూ, "ఓ కరుణా సింధో! నీయందలి ప్రేమభావంతో ఇంటిని విడిచాను. నీ భక్తుని ఏనాడూ మరువకు. నీ పాదపద్మాల దగ్గర ఆశ్రయమిచ్చినన్ను మరువకు. ఆదిశేషుడు నీగుణ కీర్తన చేస్తున్నా నేటివరకూ కృతార్థత చెందలేదు. నేను నీ దర్శన భాగ్యంవల్ల కృతార్థుణ్ణి అయ్యాను. నీ దాసకోటిలోకి నన్ను కూడా చేర్చుకో".

ఇలా అంటూ శాంతోబా బాహ్యజ్ఞానంలేని వాడయిపోయాడు. భగవంతుని కరుణాకటాక్షం ఎంతగొప్పది! ఒక్కసారి భగవంతుని



చరణకమలాలని నమ్మిదృఢంగా పట్టుకున్న వాణ్ణి భక్త వత్సలుడు ఎన్నటికీ విడువడు. ఆయన దర్శనం లభించటమే కష్టం. భగవంతుని దర్శనం అయిన తరువాత ఆయన భక్తునికి తన చరణాల వద్ద స్థానాన్ని పదిలంచేస్తాడు. భగవంతుడైన విఠలనాథుడు అతని హృదయంలో విరాజిల్లుతున్నాడు.

అంతట భగవంతుడతనితో, "భక్త శాంతోబా! నువ్వు ఇక్కడే ఉండు. నీ మధురమైన భక్తి నాకు నచ్చింది" అన్నాడు.

ఆ మాటలు విని శాంతోబా ఆనందంగా, "నీ చరణాల వద్ద నాకు స్థానం కల్పించావు తండ్రీ! నా జీవితం ధన్యం" అంటూ, భార్యతో పండరీపురమందిరంలో ఉంటూ జీవితం వెళ్ళబుచ్చాడు శాంతోబా.

----oOo----

## 5. భక్త నీలాంబరదాసు

'విషయమా! ప్రధానం? లేక భగవంతుడా? అన్న ప్రశ్నలలో దేనికి ప్రాధాన్యం అన్నదానికి చాలామంది చెప్పే సమాధానం ఏమంటే, "విషయాకర్షణ" అధికమైనది అంటున్నారు. సంసారంపట్ల ఆసక్తిగల మనుషులు ఇలా అనడం స్వాభావికమే. కాని, తత్త్వదర్శనులు, మహానుభావులు ఈ మాటలో సారంలేదంటున్నారు. ఏదో ఒక అజ్ఞాత కారణంచేత మనిషి తనకు సన్నిహితంగా ఉన్న వస్తువుల్ని, తన విషయాన్ని మరచి భగవంతుడికై ఆరాటపడుతు స్మరిస్తూ పిచ్చివానివలె సంచరిస్తుంటాడు. ఎప్పుడైతే ఆ అభిరుచి (భగవంతుడి నామస్మరణ అనే) తెలుసుకోగలుగుతాడో అప్పుడిక సంసార సంబంధమైన ఏవస్తువూ అతణ్ణి ఆకర్షించలేదు. ఈ విధంగాచూస్తే భగవంతునికి ఆత్మ భావాన్ని మరిపించేశక్తి ఉంది. అందుకే ఆయనను భువనమోహనుడు అంటున్నారు. ఇంతవరకూ ఆ ప్రభావానికి లోనుకాకపోవటం వలన భగవంతుని యథార్థరూపాన్ని తెలుసుకోలేకున్నాం. కాని, తత్త్వజ్ఞులు ఆ ఆకర్షణయొక్క అనుభూతిని కలిగియుంటున్నారు. అటువంటి వారి యొక్క సత్సాంగత్యముచే మనం కూడా భగవానుని యొక్క ప్రభావప్రకాశాన్ని దర్శించగలము.

భక్త నీలాంబరదాసుయొక్క సౌభాగ్యానికి హద్దులేదు. అతడు భువనమోహనుని యొక్క ఆకర్షణ శక్తిని, దాని ప్రభావాన్ని తెలుసుకొన్నాడు. నీలాంబరదాసు అన్నివిధాలుగా సుఖంగా ఉన్నాడు. ఆయనకి భార్య, కుమారుడు, ధనం, సపరివారంగా కుటుంబం ఉంది. గౌరవం, కీర్తి అన్నీ ఉన్నాయి. అయితే ఒకానొక క్షణంలో ఒక మోహన తంత్రం మూలంగా ఆకర్షితుడై దాసు భగవానునియందు ఆసక్తుడయ్యాడు, అది మొదలు మరి ఏ ఇతర వస్తువులయందు కూడా కోరిక నశించింది. అతడు తన భార్యాపుత్రులు, సంపదలు, పరువుప్రతిష్ఠలు మొదలైనవన్నీ మాయలో కల్పించుకున్న బంధనాలని తెలుసుకున్నాడు. ఈ మాయాబంధాలతో కలిసి ఉంటూ తన జీవితాన్ని వ్యర్థపరచుకుంటున్నానని గ్రహించాడు. అతని మనసులో వైరాగ్యభావన వృద్ధిచెందసాగింది,



చివరికతను సంసారం యొక్క అశాశ్వత త్వాన్ని, మాయాస్వరూపాన్ని తెలుసుకొని, విసిగిపోయి ఇల్లు విడిచి వెళ్ళిపోవడానికి నిశ్చయించుకున్నాడు.

నీలంబరదాసులో కలిగిన ఈ ఆలోచన అలా ఉండిపోలేదు. అది నిజమైన నిశ్చయంగా మారింది. (అది కార్యరూపం ధరించింది) ఆ తర్వాత అతను విషయసుఖాలను త్యజించి, సంసారాన్ని విడిచి విశాల జగత్తులోకి వచ్చేశాడు. భగవంతుని ఆకర్షణ ప్రభావం అంతటిది.

నీలాంబరదాసు మనస్సు చంచలమైపోగా ఇల్లు విడిచి, జగన్నాథుని ఆశ్రయించడానికి బైలుదేరాడు. అతడు భగవంతుని దర్శనం చేసుకోవాలని తహతహలాడసాగాడు. అతని స్థితి ప్రేమమూర్తి అయిన తల్లిని విడిచి పెట్టిన పసివానిలా ఉంది. పసిబిడ్డ తల్లిమీద బెంగతో చూడ్డానికి ఎలా తహతహలాడుతాడో, నీలాంబరదాసు కూడా ఆ స్వామిని చూడ్డానికి ఎంతో ఆదుర్దాచూపుతున్నాడు. ఎల్లవేళలా ఆ భగవంతుని కోసమే ఆక్రోశిస్తుంటాడు. ఆలస్యం చేయకూడదనుకొని త్వరత్వరగా ఆ ప్రభువైన జగన్నాథుని చూడాలని గబగబ పూరీకి నడకసాగించాడు. ఏ దిక్కుగా వెళుతున్నాడో అది కూడా తెలియదు. ఆహారంలేదు, నిద్రలేదు, ప్రేమికుడు తన ప్రియురాలిని కలవడానికి ఎలా తడబడుతూ లోకంమరిచి వెడుతుంటాడో అదే మాదిరిగా నీలాంబరదాసు భగవానునికై తపిస్తూ వెళుతున్నాడు. నీలాంబరదాసు నివసిస్తున్న గ్రామానికి పూరీ జగన్నాథుడు దగ్గరగా లేడు. నీలాంబరదాసు గ్రామం ఉత్తరప్రాంతంలో ఉంటే, జగన్నాథస్వామి పూరీ దక్షిణ ప్రాంతంలో ఉంది. జగన్నాథ స్వామిని చూడాలన్న కోరిక తప్పితే అతని మనసులో వేరే ఆలోచన ఏదీ లేదు. ఈ విధంగా ఒకే పంథాలో, ఒకే తలంపుతో అతను వెళ్ళిపోతున్నాడు. నదులు దాటుతున్నాడు. నిర్జనారణ్యాలు దాటుకుంటూ గంగా తీరానికి చేరాడు. అప్పుడది వర్షాకాలం. గంగానది నిండుగా, ప్రవహిస్తోంది. పెద్దపెద్ద తరంగాలతో ప్రమాదకరంగా ఉంది. అలావున్న గంగానది చూపరులకు భీతికలిగిస్తోంది. హృదయం భయంతో కంపించేలా ఉంది.

నీలాంబరదాసు నది దాటి అవతలి గట్టుకి వెళ్ళవలసి ఉంది. నావమీద తప్ప అవతలిగట్టుకి వెళ్ళడం అసంభవం అయితే మరినావ ఏది? అక్కడ పడవలాంటిదేదీ కన్పించడంలేదు. మనసులో ఈ పరిస్థితికి కలవరపడసాగాడు నీలాంబరదాసు. అప్పుడతను అనుభవించిన మానసిక క్లేశానికి అంతులేదు. దాసు ఎన్నో నదులు దాటి, గ్రామాలు, వనాలు నడచివస్తున్నాడు. అతడి శరీరంబాగా అలసిపోయింది సూర్యుడు ఆ సమయంలో అస్తాద్రికి చేరుకుంటున్నాడు. చీకటి పడబోతోంది, చాలా త్వరగా ఆవలిగట్టుకి చేరాల్సిన పరిస్థితి. ఎందుకంటే అతను ఉన్నచోటు అలాంటిది. నిర్జనప్రదేశం, చిన్నవూరైనా అక్కడికి దగ్గరలో లేదు. ఎవరినైనా పలకరించి సాయమడుగుదామనుకున్నా ఆ పరిసరాల్లో ఒక్కమనిషి కూడా కనబట్టంలేదు. అలాంటి సమయంలో శ్రీహరిని తలుచుకోవటం వినా మరో మార్గం కనబడలేదు. చేసేదిలేక దాసు శ్రీహరిని స్మరించసాగాడు.

శ్రీహరి భజన చేస్తుండగా కొంతసమయం గడిచింది. ఒక జాలరి చేపల్ని వేటాడుతు పడవమీద దూరంనుండి రావటం గమనించాడు. ఆ పడవవాణ్ణి చూసి దాసు చాలా ఆనందించాడు. శ్రీహరి దయవల్ల మార్గం దొరికినట్లనిపించింది. ఆ నావవాణ్ణి కేకలు వేయడం మొదలెట్టాడు, "ఓ జాలరీ! ఆ నావని ఈవైపుగా తీసుకురా, చాలా ఆపదలో వున్నాను. బ్రాహ్మణ్ణి అవతలి ఒడ్డుకి చేర్చాలి. నువ్వు ఎంత డబ్బడిగినా ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నాను" అన్నాడు.

నీలాంబరదాసు కేకవిని నావికుడు నావతో అక్కడకు వచ్చాడు. మెల్లగా పడవవాడు నావని ఒడ్డుకి చేర్చి బ్రాహ్మణుణ్ణి నావమీద ఎక్కించుకున్నాడు. నీలాంబరదాసు ఆనందానికి అంతులేదు. మనసులో భగవంతునికి అనేక ధన్యవాదాలు సమర్పించుకున్నాడు.

బ్రాహ్మణుణ్ణి నావలో కూర్చోబెట్టుకొని తీసుకు వెళుతున్నందుకు నావికుడు కూడా చాలా సంతోషించాడు. అంతేకాదు అతను భగవంతునికి కూడా ధన్యవాదాలు చెబుతున్నాడు. నావికుడు, బ్రాహ్మణుడు ఇద్దరూ భగవంతునికి ధన్యవాదాలర్పించారు. ఇద్దరు చెబ్తున్న ధన్యవాదాల్లో భేదం



ఉంది. నీలాంబరదాసు భగవంతుని దర్శనం పొందడానికి వేచియున్నాడు. ఇటువంటి స్థితిలో భగవానుడు నావని సమయానికి వచ్చేలా ఏర్పరిచి గట్టు దాటడానికి ఉపాయాన్ని కల్పించాడు. ఈ కారణంగా నీలాంబరుడు భగవంతునికి ధన్యవాదాలు అర్పించుతున్నాడు. పడవవాడు మరోరకంగా ఆలోచిస్తు భగవంతునికి ధన్యవాదాలు అర్పిస్తున్నాడు. వాడు నీలాంబరదాసుని నది మధ్యకి తీసుకువెళ్ళి అక్కడ చావమోది అతని దగ్గర వున్న డబ్బంతా తీసుకోవాలి అని ఆలోచించాడు. అందుచేత నావవాడు మనసులో ఎంతగానో ఉప్పొంగిపోతున్నాడు.

నావికుడు ఒట్టి మూర్ఖుడు. వాడికి నీలాంబరదాసు సంగతేమి తెలుసు? అతని సర్వస్వం భుజంమీద ఉన్న సంచిలో లేదు. దాసుయొక్క సర్వస్వం అతని హృదయంలో ఉంది. ఆ మహాసర్వస్వాన్ని ఎవడు దొంగిలించగలడు? నావికుడికి నీలాంబరదాసుని చూస్తూ అతణ్ణి ఒక సాధారణయాత్రికుడిగా, పాంధుడిగా తలచాడు. అతని భుజానికి వ్రేలాడే సంచిలో డబ్బు ఉందని భావించాడు. ఆ బ్రాహ్మణుణ్ణి నది మధ్యకి తీసికెళ్ళి, బాగా తన్ని అతని వద్దనున్న డబ్బు తీసుకోవచ్చనిపించింది. అందుకే అతను పడవను నది మధ్యకి తీసుకెళుతుంటే దాసు అతనితో, "తమ్ముడూ! నువ్వు చాలా ధైర్యం కలవాడివల్లే ఉంది. లేకపోతే ఈ తుఫానులో నావని లోతువైపుకి తీసికెళుతున్నావు. ఇలాంటి సాహసం ఎవరు చేయగలుగుతారు? సూర్యుడు అస్తమించబోతున్నాడు. వెలుగు ఉండగానే పడవని ఒడ్డుకి చేర్చడం మంచిది. అందుచేత పడవను ఒడ్డువైపుకు తీసికెళ్ళు" అన్నాడు.

దాసుమాటను విన్పించుకునేదెవరు? నావికుడి మనసులో ఉద్దేశ్యం వేరుకదా, అందుకనే వాడు నావని నదిమధ్యకే తీసుకుపోతున్నాడు. వాడు దాసు చెబుతున్న మాటలను వినిపించుకోకుండా ముసిముసిగా నవ్వుకుంటూ మొహం పక్కకి తిప్పుకున్నాడు. ఇది గమనించి దాసు వాడి మనసులోవున్న దురాలోచనని పసిగట్టి కాస్త ఖంగారుపడ్డాడు మనసులో. మళ్ళీ ఇలాంటి సమయంలో కంగారుపడకూడదని నిశ్చయించుకొని "తమ్ముడూ! ఏమిటి నీ ఉద్దేశం? నన్ను కొడదామనా? సరే మంచిది,

ఎలాకొడతావో నేను చూస్తాగా" అన్నాడు.

నీలాంబరదాసు మాటలువిని నావికుడు బిగ్గరగా నవ్వుతూ, గంభీరమైన స్వరంతో, "నువ్వే మైనా ధర్మబద్ధుడివా? కాని నీకు కాలంమూడి సమీపానికి వచ్చింది. కొంచెం ఆలస్యం మాత్రమే ఉంది. ఇక నువ్వు చివరిసారిగా ఎవరిని తలుచుకుంటావో వారిని తలుచుకో. నిన్నిప్పుడు నీలాచలం పంపుతున్నా" అన్నాడు.

నీలాంబరదాసు జాలరిమాటలువిని కంగారు పడ్డాడు. కాని, చావడానికి భయపడలేదు. భగవంతుణ్ణి దర్శించకుండా చనిపోవలసి వస్తుందేమోనని బాధపడ్డాడు. అతను ఏకాగ్రచిత్తంతో, నిరాధారులకు ఆధారంగా నిలచేవాడు దుర్బలులకు బలాన్నిచ్చేవాడైన రాముణ్ణి స్మరించడం ఆరంభించాడు. "ఓ భగవాన్! దీనకృపాబంధూ! నన్ను కాపాడుస్వామీ! నువ్వు మునుపు ఎందరి దుఃఖాలనో పోగొట్టావుకదా! ఇప్పుడు నిన్ను శరణువేడుతున్న యీ బ్రాహ్మణుణ్ణి కాపాడి దుఃఖాన్ని దూరంచెయ్యి. నువ్వు దయతో రప్పించిన నౌకద్వారా ఏ అఘాయిత్యం జరక్కుండా కాపాడు. నీ దర్శనం కాకముందే నన్ను చావనీకు" అని ప్రార్థించసాగాడు.

ఆర్తత్రాణపరాయణుడు, భక్త రక్షణబద్ధకంకణుడగు భగవంతుడు బ్రాహ్మణుడి పిలుపు విన్నాడు. ఒక రాజపుత్రవీరుడిలాగా ఉండి, భగవంతుడు ఒడ్డుదగ్గర నవయువకుడై నిలబడ్డాడు. అతను జాలరిని పిలుస్తూ, "ఓరీ! జాలరీ! ఇలారా! నీకు బ్రతుకుమీద ఆశవుంటే వెంటనే ఇటు గట్టువైపుకి రా! నావని తీరానికి మళ్ళించు".

శ్రీహరి కంఠధ్వని ఆషామాషీధ్వని కాదు. ఆ గంభీరధ్వనికి జాలరి పితరులే చనిపోయారు. జాలరి శరీరమంతా భయంతో కంపించిపోతుంటే నావ నడపటం వాడికి కష్టమైపోయింది. అయినా వాడు నావను నదిమధ్యకే తీసికెళ్ళున్నాడు. రాజపుత్రుడు మళ్ళీకేక వేశాడు. అయినా వాడు విన్పించుకోలేదు. అంతలో ఓ బాణంవచ్చి నావకి తగిలింది. ధనుర్బాణాల



ధ్వనికి జాలరి హడిలిపోయాడు. అంతేకాదు. ఆ బాణాలకాంతికి వాడి కళ్ళు మండిపోవ నారంభించాయి. వాడు ఆలోచించసాగాడు ఇప్పుడు నావని ఒడ్డుకి పట్టించక పోయానా ఆ రాజకుమారుడు బాణాలతో నన్ను చంపేస్తాడు.

ఇంక లాభంలేదని తలచి జాలరి జంకుతో పడవని ఒడ్డువైపుకి నడిపాడు. పడవను తీరానికి చేర్చి వెళ్ళి రాజకుమారుడి పాదాలపై పడ్డాడు. ఇదంతా చూస్తూ నీలాంబరదాసు విస్తుపోయి నిలుచున్నాడు. బ్రాహ్మణుడికి అది కలో నిజమో అర్థంకాలేదు. అనంతరం మాయారూపధారియైన రాజకుమారుడు కోపంతో, "ఓరి! నేను ఎల్లప్పుడూ ఈ ప్రాంతాలనే తిరుగుతుంటాను. నీలాంటి దొంగలను పట్టుకొని శిక్షిస్తుంటాను. ఇప్పుడు నేను నీకంతం నరికితేమటుకు నిన్ను రక్షించేవారెవరు?

క్షత్రియరూపధారియైన భగవంతుని మాటలు వినేసరికి వాడి ప్రాణం గాలికి ఎగిరిపోయినట్లయింది. వాడు భగవానుని పాదాలమీద పడ్డాడు. అంతట భగవంతుడు శాంతించి, నీలాంబరదాసుతో, "ఓయీ బ్రాహ్మణుడా! ఆ నావనుండి దిగిరా! నేనెవరినో గ్రహించావా? నేనీ ప్రాంతాలను రక్షించే పహరావాణ్ణి ఇక్కడ ఉండే ఉపవనాలను రక్షిస్తుంటాను. దుష్టులబారినుండి సజ్జనులను కాపాడుతుంటాను. ఈ వేషంలో ధనుర్బాణాలతో ఇక్కడికి వచ్చింది అందుకే" అన్నాడు.

క్షత్రియరూపాన్ని ధరించి వచ్చిన భగవంతుని మాటలువిని నీలాంబరదాసు ఇలా అన్నాడు, "అయ్యా! నేనెంత అదృష్టవంతుణ్ణి అందుకే ఈనాడు నేను నిన్ను దర్శించగలిగాను. నువ్వు నన్ను మృత్యుముఖంనుండి రక్షించి, నాకు మహోపకారం చేశావు. నేనిప్పుడు భగవంతుడైన శ్రీజగన్నాథుని దర్శించాలని ఉవ్విళ్ళూరుతున్నాను. అందుచేత గంగాతీరానికి ఇంకా ఎంత దూరంవెళ్ళాలి? ఎలావెళ్ళాలి? కాస్తదారి చెప్పండి. మీరు బ్రతికించిన ప్రాణాలతో ఆ నీలాచల ప్రభువుని దర్శించి జన్మసార్థకం చేసుకుంటాను". అనగా భగవంతుడతనితో, "ఓయీ బ్రాహ్మణుడా! నువ్వు చూడాలనుకుంటున్న ఆ ప్రాణనాయకుడైన

జగన్నాథుడు నీ ఎదుటే నిలుచున్నాడు. ఇప్పటికీ నువ్వు గుర్తుపట్టలేదా?" అనగా "ఎలా గుర్తించగలను? ఆయన తనంతతానుగా గుర్తింపచేసుకునే దాకా ఎవరూ ఆయనను గుర్తించలేరు. ఆయన కృపకలిగేదాకా, మనుష్యుల కోరికలు తీరవు. ఆయన్ను దర్శించే భాగ్యం లేనంతవరకూ ఎన్ని జపాలు, యాగాలు, తపస్సులు చేసినా అన్నీ వ్యర్థమే. కోటి ఉపాయాలు పన్నినా ఆయన్ని కనుక్కోవడం కష్టం. మనుష్యునకు దేవుడు జ్ఞానం ప్రసాదించిననాడే భగవంతుని తెలుసుకోగలడు.

ఇలాపలికిన నీలాంబరదాసు మాటలువిని భగవానుడు, "ఓయి బ్రాహ్మణుడా! నువ్వు జగన్నాథుణ్ణి చూడాలని ఇంటినుండి బైలుదేరావు. ఆయన్ని చూసేవరకూ నువ్వు శాంతించవు. జగత్ప్రభువైన భగవంతుడు నీకు సహాయం చేస్తాడు. ఈ నదిని దాటటమంటే పెద్దవిషయమేమికాదు. నువ్వు సంసారార్ణవాన్ని తరించగల అధికారం పొందావు" అని నీలాంబరదాసుని ఓదార్చి జాలరితో భగవంతుడిలా అన్నాడు, "ఓరి జాలరీ! ఈ బ్రాహ్మణుని గంగకి ఆవలి ఒడ్డునవే చూస్తుండగా దింపిరా. లేచివెళ్ళు. ఇలా పాదాలమీద పడితే ఏం లాభంరా నీకు! లే లేచిత్వరగా అతణ్ణి దింపిరా" అన్నాడు.

భగవానుడు పల్కిన ఈ మాటలను విన్న జాలరి ఒక్కసారిలేచి, భగవంతుణ్ణి చేసిన తప్పుకి క్షమాభిక్ష కోరాడు. ఆ తర్వాత నీలంబరదాసుని నావమీద కూర్చోబెట్టుకొని తీసుకువెళుతున్నాడు. వాడి మనసులో ఇప్పుడు చెడు కోరికలు లేవు. ఇప్పుడు వాడి నోటినుండి ఏ విధమైన చెడుమాటలు లేవు. సద్గుణాలుకలవాడిగా మారాడు జాలరి. అంతేకాదు శ్రీహరి గురించి గానంచేస్తూ నావనడుపుతున్నాడు. చూస్తుండగానే నావ గంగాతీరంచేరింది. దాసు నావదిగాడు. అల్లంతదూరాన నిలబడ్డ భగవంతుడు అంతర్ధానమయ్యాడు. నావికుడు పశ్చాత్తాపపడి బ్రాహ్మణుని పాదాలపై వాలి క్షమార్పణ వేడుకున్నాడు. బ్రాహ్మణుడు జాలరిని ఆశీర్వదించాడు. పర్వతాలు, వనాలు, నదులు, పట్టణాలు గ్రామాలుదాటి చివరికి పూరీ చేరి జగన్నాథుని దర్శించాడు దాసు.



ఆ నాడు దైవ యోగంవల్ల పూరీ రథయాత్ర జరిగేరోజు. నగరమంతా ఉత్సాహభరితంగా ఉంది. ఎక్కడ చూసినా 'జయజగన్నాథా' అనే ఘోష మిన్నుముట్టుతోంది. ఒకచోట చూస్తే మనోహర దృశ్యాలు, ఇంకోవైపు నాట్యాలు మరోవైపు సంగీతం, అలా కలకల కోలాహలధ్వనులతో నిండిపోయిందా ప్రాంతమంతా. భక్తబృందాలు జగన్నాథుని నృత్యగీతాలాపాలతో పలువిధాలుగా సేవించుతున్నారు. రథం మీద బలరాముడు సుభద్ర అటుతర్వాత జగన్నాథులు ఆసీనులయ్యారు. ఆ రథయాత్ర ఆరంభమైంది. అందరూ జయజయ అంటుంటే మూడురథాల యొక్క చక్రధ్వనులు చెలరేగుతుండగా ముందుకు సాగుతున్నాయి. నమస్కరించేవారు, అరటిపళ్ళు విసిరేవారు, కీర్తనలు పాడేవారు మణిమా! మణిమా! అంటు ధ్వనులు చేస్తున్నారు. అదంతా ఉత్సవ ఉత్సాహంతో ఆనందసీమగా ఉంది. ఇప్పుడు నీలాంబరదాసు కనులనుండి ఆనందాశ్రువులు ఒలికాయి. అవే ఆయన పాదాభిషేకబిందువులు. దాసు మనసువిప్పి తన్మయుడవుతు, భక్తి భావనతో భగవంతునితో ఏవో మాటలు పలికాడు. అలా అంటూనే రథం ముందు పడిపోయాడు.

సేవకులు, భక్తులు, ఆయనచుట్టుమూగారు. అంతలో ఆయనలోని ప్రాణం పక్షిలా ఎగిరిపోయింది. "హరే రామ హరే కృష్ణ" అంటూ ఎగిరిపోతున్న ఆ జ్యోతి జగన్నాథునిలో లీనమైంది. దాసు మరణవార్త దశదిశలా వ్యాపించింది. అందరూ అతని మరణవార్త విని దుర్లభమైన స్థానాన్ని పొందాడని, అతని జీవిత గమనాన్ని ప్రశంసించారు. అతని మృత్యువుకూడ ఈ మృత్యులోకంలో అమరమైందని అంతా ప్రశంసించారు. దాసు మరణానికి సంబంధించిన అద్భుతవిషయం జగన్నాథపూరీలో ప్రతి ఒక్కరు విన్నారు.

----oOo----

# గణనాయకాష్టకము

ఏకదంతం మహాకాయం తప్తకాంచన సన్నిభమ్
లంబోదరం విశాలాక్షం వందేఽహం గణనాయకమ్ 1

మౌంజీ కృష్ణాజిన ధరం నాగ యజ్ఞోపవీతినమ్
బాలేందుశకలం మౌళే వందేఽహం గణనాయకమ్ 2

చిత్రరత్న విచిత్రాంగం చిత్రమాలా విభూషితమ్
కామరూపధరం దేవం వందేఽహం గణనాయకమ్ 3

గజవక్త్రం సురశ్రేష్ఠం కర్ణ చామరభూషితమ్
పాశాంకుశధరం దేవమ్ వందేఽహం గణనాయకమ్ 4

మూషకోత్తమ మారుహ్య దేవాసుర మహాహవే
యోద్ధుకామం మహావీర్యం వందేఽహం గణనాయకమ్ 5

యక్ష కిన్నర గంధర్వ సిద్ధ విద్యాధరై స్సదా
స్తూయమానం మహాబాహుం వందేఽహం గణనాయకమ్ 6

అంబికా హృదయానందం మాతృభిః పరివేష్టితమ్
భక్తప్రియం మదోన్మత్తం వందేఽహం గణనాయకమ్ 7

సర్వవిఘ్నహరం దేవం సర్వవిఘ్న వివర్జితమ్
సర్వసిద్ధి ప్రదాతారం వందేఽహం గణనాయకమ్ 8

గణాష్టకమిదం పుణ్యం యః పఠే త్సతతం నరః
సిద్ధ్యంతి సర్వ కార్యాణి విద్యావాన్ ధనవాన్ భవేత్
ఇతి శ్రీగణనాయకాష్టకమ్



# శ్రీకృష్ణాష్టకము

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనం
దేవకీ పరమానందం కృష్ణం వందే జగద్గురుమ్ 1

అతసీపుష్పసంకాశం హారనూపురశోభితం
రత్న కంకణ కేయూరం కృష్ణం వందే జగద్గురుమ్ 2

కుటిలాలకసంయుక్తం పూర్ణచంద్రనిభాననం
విలసత్కుండలధరం కృష్ణం వందే జగద్గురుమ్ 3

మన్దారగంధ సంయుక్తం చారుహాసం చతుర్భుజం
బర్హి పింఛావ చూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్ 4

ఉత్ఫుల్ల పద్మపత్రాక్షం నీల జీమూత సన్నిభం
యాదవానాం శిరోరత్నం కృష్ణం వందే జగద్గురుమ్ 5

రుక్మిణీ కేళి సంయుక్తం పీతాంబర సుశోభితం
అవాప్త తులసీ గంధం కృష్ణం వందే జగద్గురుమ్ 6

గోపికానాం కుచద్వంద్వం కుంకుమాంకిత వక్షసం
శ్రీ నికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుమ్ 7

శ్రీ వత్సాంకం మహోరస్కం వనమాలా విరాజితం
శంఖ చక్ర ధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్ 8

కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి
ఇతి శ్రీకృష్ణాష్టకమ్

# లక్ష్మీనృసింహ స్తోత్రము

శ్రీమత్పయోనిధి నికేతన చక్రపాణే
భోగీంద్రభోగ మణిరంజిత పుణ్యమూర్తే
యోగీశ శాశ్వత శరణ్య భవాబ్ధిపోత
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

బ్రహ్మేంద్ర రుద్రమరు దర్కకిరీటకోటి
సంఘట్టి తాంఘ్రికమలామల కాంతి కాంత
లక్ష్మీ లసత్కుచసరోరుహ రాజహంస
లక్ష్మీనృసింహ మమ దేహి కరావలంబమ్

సంసారసాగర విశాల కరాళ కాల
నక్రగ్రహ గ్రసన నిగ్రహ విగ్రహస్య
వ్యగ్రస్య రాగరసనోర్మి నిపీడితస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

సంసార ఘోర గహనే చరతో మురారే
మారోగ్ర భీకరమృగ ప్రవరార్దితస్య
ఆర్తస్య మత్సరనిదాఘ నిపీడితస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

సంసారకూప మతిఘోర మగాధమూలం
సంప్రాప్య దుఃఖ శత సర్పసమాకులస్య
దీనస్య దేవ కృపణాపద మాగతస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్



సంసారభీకర కరీంద్ర కరాభిఘాత-
నిష్పిష్టమర్మ వపుషః సకలార్తినాశ
ప్రాణప్రయాణ భవభీతి సమాకులస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

సంసారసర్పఘనవక్త్ర భయోగ్రతీవ్ర-
దంష్ట్రాకరాళ విషదగ్ధ వినష్టమూర్తేః
నాగారివాహన సుధాబ్ధినివాస శౌరే
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

సంసారజాల పతితస్య జగన్నివాస
సర్వేంద్రియార్థబడిశార్థ ఝషోపమస్య
ప్రోత్ఖండిత ప్రచుర తాలుక మస్తకస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

సంసారవృక్ష మఘబీజ మనంతకర్మ
శాఖాశతం కరణపత్ర మనంగపుష్పమ్
ఆరుహ్య దుఃఖఫలితం పతతో దయాళో
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

సంసార దావదహనాతుర భీకరోరు-
జ్వాలావలీభి రతి దగ్ధ తనూరుహస్య
త్వత్పాదపద్మసరసీ శరణాగతస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

బద్ధ్వాగలే యమభటా బహుతర్జయన్తః
కర్షంతి చాత్ర భవపాశ శతైర్యుతం మామ్
ఏకాకినం పరవశం చకితం దయాళో
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

ఏకేన చక్ర మపరేణ కరేణ శంఖ-
మన్యేన సింధుతనయా మవలంబ్య తిష్ఠన్
వామేకరేణ వరదాభయ పద్మచిహ్నం
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాది భాగవతపుంగవ హృన్నివాస
భక్తానురక్త పరిపాలన పారిజాత
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

అంధస్య మే హృతవివేక మహాధనస్య
చోరైః ప్రభో బలిభిరింద్రియ నామధేయైః
మోహాంధ కూపకుహరే వినిపాతితస్య
లక్ష్మీనృసింహ మమదేహి కరావలంబమ్

లక్ష్మీపతే కమలనాభ సురేశ విష్ణో
వైకుంఠ కృష్ణ మధుసూదన పుష్కరాక్ష
బ్రహ్మణ్య కేశవ జనార్దన వాసుదేవ
దేవేశ దేహి కృపణస్య కరావలంబమ్

యన్మాయ యోర్జితవపుః ప్రచుర ప్రవాహ-
మగ్నార్థ మత్రనివహోరు కరావలంబమ్
లక్ష్మీనృసింహ చరణాబ్జ మధువ్రతేన
స్తోత్రం కృతం శుభకరం భువిశంకరేణ.

ఇతి శ్రీమచ్ఛంకరాచార్యకృతం.
లక్ష్మీనృసింహ స్తోత్రమ్
----oOo----



# లింగాష్టకము

బ్రహ్మమురారిసురార్చితలింగం నిర్మలభాసితశోభితలింగం
జన్మజదుఃఖవినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 1

దేవమునిప్రవరార్చితలింగం కామదహనకరుణాకరలింగం
రావణదర్పవినాశకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 2

సర్వసుగంధిసులేపితలింగం బుద్ధివివర్ధన కారణలింగం
సిద్ధసురాసురవందితలింగం తత్ప్రణమామి సదాశివలింగం 3

కనకమహామణిభూషితలింగం ఫణిపతివేష్టితశోభితలింగం
దక్షసుయజ్ఞ వినాశనలింగం తత్ప్రణమామి సదాశివలింగం 4

కుంకుమచందనలేపితలింగం పంకజహారసుశోభితలింగం
సంచిత పాపవినాశనలింగం తత్ప్రణమామి సదాశివలింగం 5

దేవగణార్చిత సేవితలింగం భావైర్భక్తిభిరేపచలింగం
దినకరకోటి ప్రభాకరలింగం తత్ప్రణమామి సదాశివలింగం 6

అష్టదళోపరివేష్టితలింగం సర్వసముద్భవకారణలింగం
అష్టదరిద్రవినాశనలింగం తత్ప్రణమామి సదాశివలింగం 7

సురగురుసురవరపూజితలింగం సురవరపుష్పసదార్చితలింగం
పరమపరం పరమాత్మకలింగం తత్ప్రణమామి సదాశివలింగం 8

లింగాష్టకమిదం పుణ్యం యః పఠే చ్ఛివసన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహమోదతే
ఇతి లింగాష్టకమ్

# శ్రీ శివపంచాక్షరీ స్తోత్రము

నాగేంద్రహారాయ త్రిలోచనాయ భస్మాంగరాగాయ మహేశ్వరాయ
నిత్యాయ శుద్ధాయ దిగంబరాయ తస్మై 'న' కారాయ నమః శివాయ ॥

మందాకినీసలిలచందనచర్చితాయ నందీశ్వరప్రమథనాథ మహేశ్వరాయ
మందారపుష్పబహుపుష్పసుపూజితాయ తస్మై 'మ' కారాయ నమః శివాయ

శివాయ గౌరీవదనాబ్జవృందసూర్యాయ దక్షాధ్వరనాశకాయ
శ్రీనీలకంఠాయ వృషధ్వజాయ తస్మై 'శి' కారాయ నమః శివాయ ॥

వశిష్ఠకుంభోద్భవగౌతమార్యమునీంద్రదేవార్చితశేఖరాయ
చంద్రార్క వైశ్వానరలోచనాయ తస్మై 'వ' కారాయ నమః శివాయ ॥

యక్షస్వరూపాయ జటాధరాయ పినాకహస్తాయ సనాతనాయ
దివ్యాయ దేవాయ దిగంబరాయ తస్మై 'య' కారాయ నమః శివాయ ॥

పంచాక్షరమిదం పుణ్యం యః పఠేచ్ఛివసన్నిధౌ
శివలోక మవాప్నోతి శివేన సహ మోదతే

ఇతి శ్రీమచ్ఛంకరాచార్య విరచితం
శివపంచాక్షరీ స్తోత్రమ్ సంపూర్ణమ్

----oOo----



# అన్నపూర్ణాష్టకము

నిత్యానందకరీ వరాభయకరీ సౌందర్య రత్నాకరీ
నిర్ధూతాఖిల ఘోర పావనకరీ ప్రత్యక్ష మాహేశ్వరీ
ప్రాలేయాచల వంశ పావనకరీ కాశీ పురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ 1

నానారత్న విచిత్ర భూషణకరీ హేమాంబ రాడంబరీ
ముక్తాహార విడంబమాన విలసద్వక్షోజ కుంభాంతరీ
కాశ్మీరాగరు వాసితాంగ రుచిరా కాశీ పురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ. 2

యోగానందకరీ రిపు క్షయకరీ ధర్మైకనిష్ఠాకరీ
చంద్రార్కానల భాసమాన లహరీ త్రైలోక్యరక్షాకరీ
సర్వైశ్వర్యకరీ తపః ఫలకరీ కాశీ పురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్న పూర్ణేశ్వరీ. 3

కైలాసాచల కంద రాలయకరీ గౌరీ హ్యుమా శాంకరీ
కౌమారీ నిగమర్థగోచర కరీ హ్యోంకార బీజాక్షరీ
మోక్షద్వార కవాట పాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ. 4

దృశ్యాదృశ్య విభూతి పావనకరీ బ్రహ్మాండ భాండోదరీ
లీలా నాటకసూత్ర ఖేలనకరీ విజ్ఞాన దీపాంకురీ
శ్రీవిశ్వేశ మనఃప్రమోదనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ. 5

ఆదిక్షాంత సమస్త వర్ణనకరీ శంభుప్రియే శాంకరీ
కాశ్మీరే త్రిపురేశ్వరీ త్రినయనీ విశ్వేశ్వరీ శ్రీధరీ
స్వర్గద్వార కవాట పాటనకరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ. 6

ఉర్వీసర్వజయేశ్వరీ జయకరీ మాతాకృపాసాగరీ
నారీ నీలసమాన కుంతలధరీ నిత్యాన్న దానేశ్వరీ
సాక్షాన్మోక్షకరీ సదా శుభకరీ కాశీ పురాధీశ్వరీ
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ. 7

చంద్రార్కానల కోటి కోటిసదృశా చంద్రాంశు బింబాధరీ
చంద్రార్కాగ్ని సమాన కుండలధరీ చంద్రార్క వర్ణేశ్వరీ
మాలాపుస్తక పాశ సాంకుశధరీ కాశీపురాధీశ్వరీ
భిక్షాం దేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ. 8

క్షత్రత్రాణకరీ సదా శివకరీ మాతా కృపాసాగరీ
సాక్షాన్మోక్షకరీ సదా శివకరీ విశ్వేశ్వరీ శ్రీధరీ
దక్షా క్రందకరీ నిరామయకరీ కాశీపురాధీశ్వరీ.
భిక్షాందేహి కృపావలంబనకరీ మాతాన్నపూర్ణేశ్వరీ. 9

అన్నపూర్ణే సదాపూర్ణే శంకర ప్రాణవల్లభే
జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం భిక్షాం దేహి చ పార్వతి.
మాతా చ పార్వతీదేవీ పితా దేవో మహేశ్వరః
బాంధవా శ్శివభక్తాశ్చ స్వదేశో భువనత్రయమ్. 10

ఇత్యన్నపూర్ణాష్టకమ్

----oOo----